

సంపుటము 20
సంచిక 8

భారతి

స్వభాను శ్రావణము
1943 ఆగస్టు

# నా యెడంద

= 'స్వైరవిహారి' =

౧

కరములు సాఁచి మిత్రుఁ డనుకంపఁ గవుంగిలి నుంప నిండుగా
విరియకమున్నె బల్మి నిటు వేరొనరించి, హసించు నీ యనం
తరజని కంతమన్నదె కనంబడకున్నది; నాయెడంద తా
మరను వికాసహీన సుకుమారమఁ గాంచఁగనీయవా? ప్రభూ!

౨

అరనిముసమ్ములోనన రయమ్మున గింగురుమంచు భూమిపైఁ
దిరుగవలంతి; నేఁటి కతిదీనత నొందు, తదీయసద్గుణో
త్కర మనునిత్యదుర్భరవిఘట్టనకుం దెగ, నాయెడందబొం
గరమును జాలిఁజూచి, సరిగాఁ దిరుగం బొనరింపవే ప్రభూ!

3

అరసికతావలంబి పరిహాసవిలాస సరోషదూషణా
దరదర వేల్లదంతరకుతంత్రవిషాక్తలతావళీ భయం
కరమయి, లేశమేని పరిణామమునొందని నాయెడంద పం
దిరి నిఁకనేని కన్గొనవ? స్నేహలతల్ కొనసాగఁగా ప్రభూ!

౪

సురుచిరవర్ణవాసనల సుందరమయ్యు ససర్థితమ్మునై
ధరపయి రాలి, దుర్జనపదాహతి దూలి, మహాద్విపత్పరం
పరలకుఁ జిక్కి, స్రుక్కి, వసివాడకపూర్వమె నాయెడంద మం
జరిని భవత్పవిత్రపదసన్నిధి కర్హమొనర్పవా ? ప్రభూ !

౫

మెఱుఁగులబాటలోనికి గమించి, వెలుంగుఁబూరంగురంగుపూ
సరుల పసిండిరేకుల పసందుల నీచరణారుణాబ్జబం
ధరకరుణాలవాప్తికి నివాళులొసంగెడు నాయెడంద గో
పురమున నైచ్యకీటముల పుట్టల నిట్టులె యుంతువా ? ప్రభూ !

౬

అరసిన నిండెయున్నవి సమస్తమటంచును నేఁటికిఁ వరహో
గురశుభదృష్టి నేఁ దెలిసికోఁ ఫలమేమి ? మహాంధకార బం
ధురమయి లోని వింతలు జనుల్ కనఁజూపని నాయెడంద మం
దిరమున నీ తనుద్యుతులు, నీస్మితదీప్తులు నింపవా ? ప్రభూ !



# బద్దెన - నీతిశాస్త్రముక్తావళి

= శ్రీ బులుసు వేంకటేశ్వర్లు =

ఆంధ్రభాషారమాయత్న కమూల్యాలంకార మొసఁగిన ఆంధ్రనృపాలురయందుఁ జేరెన్నికఁ గన్నవారలలో బద్దెనృపాలుఁ డొకఁడు. ఇతఁ డాంధ్ర చోళుల సంతతికిఁ జెందిన యొక సామంతరాజు. ఇతను, తన పరిపాలనావధినము బురస్కరించుకొని, తన పాండితీగరిమఁ దోడుచేసికొని తోడిరాజులకే కాక భావినృపాలసంతతికిని అనువర్తనసాధన మగు నాదర్శప్రాయమైన రాజనీతిని 'నీతిశాస్త్రముక్తావళి' యను నామమున విరచించియున్నాఁడు. ఈగ్రంథమే 'బద్దెననీతులు' అను నామాంతరమున నైరెను వ్యవహరింపఁబడుచున్నది. ఇం దాదర్శప్రాయము లగు రాజనీతులే కాక త్రికాలాబాధ్యము లైన పరమసత్యములు (Universal truths) నైతము విరాజిల్లుచున్నవి. ఈ గ్రంథ విమర్శనమునకు ముందు బద్దెనృపాలుని కాలమునుగూర్చి కొంత విచారించవలసియున్నది.

## బద్దెనకాలము - వివిధవాదములు

ఈ బద్దెనకాలమునుగురించి రెండుమూఁడువాదములు కలవు. అందు 'నీతిశాస్త్రముక్తావళి'ని పరిష్కరించి ప్రకటించిన శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు, ఆంధ్రకవుల చరిత్రమును విరచించిన కీ. శే. కందుకూరి వీరేశలింగముపంతులుగారు, కళాప్రపూర్ణులు, సూర్యరాయాంధ్రనిఘంటుసంపాదకులు నైన కీ. శే. జయంతి రామయ్యపంతులుగారును దమతమ యభిప్రాయములను దెలిపియున్నారు. వీరి యాధారములను గ్రమముగాఁ బరిశీలించి యందలి యాథాతథ్యమును పరిగణింతము.

శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు పైగ్రంథమునకుఁ జేర్చిన తమ పీఠికలో ఈ క్రింది శాసనము నుదాహరించిరి :

"శాసనము—శ్రీకృష్ణవేణీనదీతీర దక్షిణషట్సహస్రవిషయాధీశ్వర వీరమాహేశ్వర కీర్తిసుధాకర గుణరత్నాకర వేంగిచాళుక్యమూల స్తంభరిపు దళితకుంభి కుంభబలయాంగనా గృహతోరణ వన్నవగంధవారణనామాది ప్రశస్తిసహితం శ్రీ మహామండలేశ్వర బద్ద (ద్దె?) చోళవతేంద్రవు..." (పాశ్చాత్యచాళుక్యుఁడను భువనైకమల్లుని కాలమునాఁటి శాసనము).

ఈ శాసనమువనుసరించి బద్దెన క్రీ.శ. ౧౦౩౦-వ సంవత్సరమున నుండెనమ్మవనిరి. కాని, ఇది నమ్మఁదగినది కాదని శ్రీ కవిగారే రెండుప్రమాణములఁ జూపిరి. అందు మొదటిదీ శాసనము చెన్నపురి గ్రంథభాండాగారమందలి చరిత్రములోనిది గాన విశ్వసింపఁదగదనియు, రెండవది పైశాసనమందలి బిరుదావళిగలవాఁడు సామంతరాజమాత్రుఁడు కాఁజాలఁ డనియును దీనిని త్రోసివేసిరి. ఈప్రకారము శ్రీ రామకృష్ణకవిగారు బద్దెనకాలము వనిశ్చయముగనే విడిచిరి.

పిమ్మట ఆంధ్రకవుల చరిత్రకారు లగు వీరేశలింగముగారు అట్టి బిరుదులుఁగల సామంతరాజు లుండుట యాశ్చర్యము కాదనియు, పై కాలనిర్ణయమును గాదని బద్దెన ౧౨-వ శతాబ్దమువాఁడని తేల్చిరి. ఇందులకు బద్దెనకృతమని రామకృష్ణకవిగారు నీతిశాస్త్రముక్తావళి ౩౦-వ పుటలో నుదాహరించిన ఈ క్రిందిపద్యము నాధారముఁ జేసికొనిరి. ఆపద్య మిది:

"పరువడి నాంధ్రభాషఁ గల
బద్దెననీతియు సంస్కృతంబులోఁ
బరఁగుఁ బ్రతాపరుద్ర నర
పాలునిచే రచియింపఁబడ్డ యా
నర వరు నీతిసారము వి
నం జదువం గడు మంచి దంచుఁ జె
ప్పిరఁ గవి నీతిపద్ధతులు
చేసె వినోదము బాలబోధకున్."

పైపద్యమునఁ జేర్కొనఁబడిన (మొదటి) ప్రతాపరుద్రుఁడు ౧౧౮౦ మొదలుకొని ౧౧౯౬ వఱకు రాజ్యపాలనము చేసినవాఁ డగుటచేత బద్దెన అతని తరువాతివాఁ డగుట పైపద్యమునుండి స్పష్టమగుట ౧౧౯౬-వ సంవత్సరమునకుఁ దరువాతివాఁడు కావలెను. కనుక ౧౨-వ శతాబ్దివాఁడని వీరేశలింగముగారు తేల్చిరి.

వీరేశలింగముగారి వాద మసమంజసము, నక్రమమును. ఈ పద్యమును జూచిన నిది బద్దెనకృతము గాదని స్పష్టముగాఁ దెలియుచున్నది. ఏలన, పై పద్యభావము ఇది : "ఆంధ్రమున నున్న బద్దెనీతియు, సంస్కృతమునఁగల ప్రతాపరుద్ర విరచిత నీతిసారమును వినఁ జదువ నుత్తమములైన వగుట బాలబోధకై వినోదముగాఁ గవి యందలి నీతుల ననుసరించి యీ నీతిపద్ధతులఁ జేసెను." ఇదివఱకే గ్రంథరూపముఁ దాల్చిన బద్దెనీతి నీతిసారముల ననుసరించి బాలబోధకై నీతిపద్ధతులఁ జేసెనని యీ పద్యము చెప్పుచుండఁగా, బద్దెనీతిని జూచి మరల బద్దెన వ్రాయఁదలంచు టసంబద్ధము కాదా? అందుచే నిది బద్దెనకృతము కాని దగుట శ్రీరామకృష్ణకవిగారీ పద్యమును బద్దెనదని నీతిశాస్త్ర ముక్తావళిలోఁ జేర్చుట కాధారము మృగ్యము. దాని భావ మఱయక దానిని తమ వాదమున కాధారముగా వీరేశలింగముగారు చేసికొనుటయుఁ జింత్యమే. ఇంతే కాక, పూర్వాపరసందర్భముల ననుసరించినను బద్దెన నీతిని మొదట చేర్కొనుటయు, నీతిసారమును బిమ్మటఁ జేర్కొనుటయు బద్దెన ప్రతాపరుద్రునికిఁ బూర్వుఁడనుటకే యీపద్యము తోడ్పడునుగాని తరువాతివాఁడయియుండవలెనని యీ పద్యము వీరేశలింగముగారి కెట్లు స్పష్టముగాఁ గానవచ్చెనదో తెలియకున్నది. మఱియుఁ బై పద్యాంతమున 'బాలబోధకకా' అని యుండుటచే, 'రాజనీతిశాస్త్రము' బాలురకుఁ గాఁజాలదు కదా! అంతియకాక "ఆదిలో నీతిసార మను గ్రంథమున బద్దెన పూర్వకవిగా స్తుతింపఁబడె" నని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు నీతిశాస్త్ర ముక్తావళీ పీఠికలో వ్రాసియున్నారు. అందుచే పైపద్యము నీతిశాస్త్రముక్తావళి, నీతిసారము రెండింటిఛాయలు గల సుమతిశతకమునకే యన్వయించుట కుపయోగించును గాన దీనిపైఁ గావించిన వీరేశలింగముగారి యూహలు నిరాధారములే యగును. అందుచే బద్దెన కాలనిర్ణయమునకు మఱియొక ప్రబలాధారము చూపవలసియున్నది.

ఇఁక మూఁడవవారగు శ్రీ జయంతి రామయ్య పంతులుగారు బద్దెనకాలనిర్ణయమును దెలుపు రెండు శాసనములను సంపాదించి ప్రకటించిరి. ఈ రెండును కృష్ణాజిల్లాలోని గన్నవరము తాలూకాయందలి కొండ (డి? పాయని) వరగ్రామ బ్రహ్మేశ్వరస్వామి యాలయమునందలివి. వీనిలోని మొదటి శాసన మసంపూర్ణముగ లభించినది. మిగిలినది శిథిలమైనది. ఇది : "శాసనము—స్వస్తి సమస్త ప్రశస్తి సహితం శ్రీమన్మహామండలేశ్వర వీరనారాయణచోడ బద్దిగ దేవరాజులు శకవర్షంబులు ౧౧౫౩ ద్దు౬ నేంటి కర్కాటక సంక్రాంతినాండు......"

ఈ శాసనమునఁ జెప్పిన శాలివాహనశకము ౧౧౫౩ నకు ౭౮ కలుపఁగా ౧౨౩౧ క్రీస్తుశకము అగుచున్నది. మఱియు రెండవశాసన మిట్లున్నది :

"శాసనము—

శ్లో. శ్రీనాథనాభినీరేజసంభూతః బ్రహ్మణః పురా,
జాతా విశ్వగుణాక్షీణలక్ష్మీ రాజపరంపరా,
తస్యాం బద్దిగభూపోఽభూ ద్వీరనారాయణాంకితః,
చోడదోరయ (భూపో) స్యపుత్రో భూ దస్య నందనః.

శ్రీ శాకాద్దే పురాష్టా
దశ శశిగణితే కర్కసంక్రాంతికాలే
సప్రాదా ద్దీప మిష్ట
ప్రదమనవరతం చోడబద్దిక్షితీశః,
శ్రీమద్బ్రహ్మేశ్వరాయ
శశి రవి విశదం గోంకవాంకస్య, (శే?) తే
సద్దీపార్థం చవేశేటి
జనపదమహీం వింశతిద్రోణ సంఖ్యాం"

అని పూర్తిగా నున్న శాసనమునుబట్టికూడ క్రీ. శ. ౧౨౩౧-వ సంవత్సరమని తేలుచున్నది. క్రీస్తుశకము ౧౨౩౧ ప్రాంతమున కాకతీయరాజ్యమును రుద్రమదేవి పరిపాలించుచుండెను. కనుక, బద్దెన యనువాఁడామెకు సామంతుఁడై కృష్ణాతీరమం దొక చిన్న రాజ్యమును బాలించుచు నుండియుండవలెనని శ్రీ జయంతి రామయ్యపంతులుగారు నిర్ణయించిరి.

ఈ నిర్ణయమును బరిశీలించినను సంశయాంశములు లేకపోలేదు. బద్దెననామధేయులనేకులు కానవచ్చుచున్నారు. శాసనమున నున్నంతమాత్రమున నీబద్దెనయో నిర్ణయించుట కాధారములు మృగ్యములే. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రిచ్చిన చెన్నపురి భాండాగారశాసనమునను బద్దెననామధేయము కలదు. అతఁడు ౧౦౪౦ ప్రాంతమువాఁడుగాఁ గన్పట్టుచున్నాఁడు. ప్రస్తుతగ్రంథమే బద్దెన వ్రాసినదియు,

తెలియదు. మఱియు, నీతిశాస్త్రముక్తావళియందలి గద్యననుసరించి—

"గద్య. ఇది శ్రీ లక్ష్మీవల్లభ శ్రీ పాదపద్మా రాధక కమలాప్తకులపవిత్ర నన్నన గంధవారణ రాజ రాజ మనోజాంక బద్దెనాఖ్యప్రణీతంబైన రాజనీతి ప్రకారం బన్నది సర్వము సంపూర్ణము."

పై నన్నయగంధవారణేత్యాది బిరుదములఁ గాంచి పరిశీలించినను, చెన్నపుర భాండాగారశాసనమున సైతము "నన్నయ గంధవారణనామాది ప్రశస్తసహితం" అనియున్నది. ఇది పైచెప్పు రామయ్యపంతులుగారు సంపాదించిన శాసనములందే కానవచ్చుటలేదు. ఇంతే కాక, విక్రమార్కచరిత్రమునఁ జేర్కొనఁబడిన నన్నయగంధవారణుఁ డొకఁడు కలఁడు. ఈతనికి సిద్ధనమంత్రి మంత్రి. ఈతని మనుమఁడైన సిద్ధనకే విక్రమార్కచరిత్రము కృతిగా నీయఁబడినది. విక్రమార్కచరిత్రమునఁ గల పద్య మిది:

"వనరుహనాభు పద్దవుఁడు
వజ్రికి జీవుఁడు వత్సధారుణీ
శునకు యుగంధరుండు దితి
సూతికి దైత్యగురుండు విక్రమా
ర్కునకును భట్టికీర్తి నధి
కుండగు నన్నయగంధవారణం
బునకుఁ బ్రధానుఁడై నుతులఁ
బొందెను సిద్ధనమంత్రి యుద్ధరన్."

దీనివిషయమున వీరేశలింగముపంతులుగా రిట్లు వ్రాసియున్నారు:

"౧౧౫౬-వ సంవత్సరము మొదలుకొని ౧౧౬౩-వ సంవత్సరమువఱకును రాజ్యపాలనము చేసిన వెలనాటిచోడుఁ డనఁబడెడు రాజేంద్రచోడునిచే నగ్రహారాదికమును బడసిన సూరన సోమయాజికి మనుమఁడగుటచే సిద్ధనమంత్రి ౧౨౪౦-౫౦ సంవత్సర ప్రాంతముల నుండియుండవలెను. అప్పుడు సిద్ధనమంత్రి ప్రభువైన నన్నయగంధవారణుఁడును ఇంచుమించుగా ఆకాలమునందే యుండును. ఈకాలము బద్దెనృపాలుని శాసనకాలముతో దాదాపుగా సరిపోవును. కాఁబట్టి యీ నన్నయగంధవారణుఁడే బద్దెనృపతియే మో!"

ఈయూహ సమంజసముగానే కానవచ్చుచున్నది. మఱియు రామయ్యపంతులుగారి నిర్ణయమునకుఁ దోడగుచున్నది.

కాని పైనిర్ణయము నంగీకరించుటకుఁ బూర్వోదాహృతమైన:—

"పరువడి నాంధ్రభాషఁ గల
బద్దెనీతియు సంస్కృతంబులోఁ
బరఁగ ప్రతాపరుద్ర నర
పాలునిచే రచియింపఁబడ్డ యీ
నరవరు నీతిసారము..."

అను పద్యము ననుసరించి బద్దెన ప్రతాపరుద్రునకుఁ బూర్వుఁడే యని తోఁచుచున్నది. అనఁగా ౧౧౪౦ మొదలు ౧౧౭౨ వఱకుఁ బ్రతాపరుద్రుఁడు పాలించియుండుటచే బద్దెన ౧౧౪౦ కి పూర్వుఁ డన వలెను. ఈయూహ ౧౦౭౦ ప్రాంతమువాఁ డన్న చెన్నపురిశాసనమునకు సమారమి సరిపోవుచున్నది. పైఁగా, ప్రతాపరుద్రుఁడే నీతిసారమునఁ బూర్వకవిగా బద్దెనను స్తుతించెనని కవిగారు వ్రాసియున్నారు.

ఇంతకుఁ దేలిన దేమన: పై రెండు నిర్ణయములకును ప్రతిబంధకములు పైకిఁ గానవచ్చుచుండుటచేతను, నేవాద మంగీకరించుటకును ప్రబలాధారములు లభింపకపోవుటచేతను బద్దెనకాలనిర్ణయము ఇంకను బరిశోధనీయాంశమే యైయున్నది.

బద్దెన నీతిశాస్త్రముక్తావళి రచించుటకుఁ బూర్వము సుమతిశతకము రచించిన ట్లీక్రింది పద్యమునఁ జెప్పియున్నాఁ డని రామకృష్ణకవిగారును, దాని నంగీకరించి వీరేశలింగముపంతులు గారును జేర్కొనియున్నారు.

"శ్రీవిభుఁడ గర్వితారి
క్ష్మావరదళనోపలబ్ధ జయలక్ష్మీ సం
భావితుఁడ సుమతిశతకము
గావించిన ప్రోడఁ గావ్యకములాసనుఁడన్".

ఈపద్యము నీతిశాస్త్రముక్తావళి వ్రాఁతప్రతుల నెచ్చటను గానరాలేదనియుఁ, గాన నంత విశ్వసనీయము గాదనియు ధ్రువపఱచియున్నాము. * పైపద్యమున

* చూ. చిత్రభాను సంవత్సర ఫాల్గున భారతిలోని 'సుమతిశతకము: కర్తృత్వవిచారము.' అను వ్యాసము.

సుమతిశతక మే ముందు వ్రాసినట్లును, "పరువడి సాంధ్ర భాషఁ గల బద్దెననీతి..." యను పద్యమున నీతిశాస్త్ర ముక్తావళియే ముందు విరచించినట్లును బద్దెనయే చెప్పె ననెనని యుదాహరించిన శ్రీ వీరేశలింగముగారి యూహా పరస్పరవిరుద్ధమున కాలవాలమైనది. కాన దీనివలనఁ గూడ సుమతిశతకము బద్దెనకృతము కాదని యు, నాతని తరువాతి కవిచేతనే విరచింపఁబడిన దని యుఁ దేలుచున్నది. అందువలన బద్దెన నీతిశాస్త్ర ముక్తావళి యను గ్రంథ మొక్కటి దానినే రచించియు న్నాఁడనుటయే సత్యము.

## గ్రంథప్రాశస్త్యము

సారస్వతమున బద్దెన నీతిశాస్త్రముక్తావళికిఁ గల స్థానము ఇందలి పద్యముల ననేకుల లాక్షణికు లుదా హరించియుండుటవల్లను, భాషామాధుర్యమునను, భావ వైశిష్ట్యమునందును ఆంధ్రమునఁ గల రాజనీతిగ్రంథముల నుత్తమమైనదిగా నెన్నఁబడుటవలనను విదితమగుచు న్నది. ప్రతాపరుద్రునిచే విరచింపఁబడిన నీతిసార మను గ్రంథమున బద్దెన పూర్వసుకవులలో నొకఁడుగా స్తుతింపఁబడినాఁడు. మడికి సింగన తన సకలనీతిసమ్మ తములో ననేకములగు నీతని పద్యము లుదాహరించియు న్నాఁడు. శ్రీనరచ్ఛందమునను, కవిసంజీవనియందును, రత్నాకరమునందును, ప్రబంధరాజ శ్రీవేంకటేశ్వర విజయవిలాస మను నలంకృతిగ్రంథమును విరచించిన వేం కటకవి లక్షణశిరోమణియందును బద్దెన నీతిశాస్త్ర ముక్తావళియందలి పద్యముల నుదాహరించియున్నారు.

ఆంధ్రమునఁ గల రాజనీతిగ్రంథములలో క్షేమేంద్రుని ముద్రామాత్యము, ప్రతాపరుద్రుని నీతిసా రము, భోజరాజవిభూషణ మను నీతిభూషణము, చాణక్యచర్య, ప్రాచీనకామందకము, ప్రాచీనపంచతంత్రి, శివదేవయ్య పురుషార్థసారము, ఆరాధ్యదేవుని స్వరతత్వ సారము, మడికిసింగన నీతివాక్యావళి మున్నగునవి ప్రసిద్ధ ములు. పైవానిలోఁ గొన్ని గ్రంథములు ప్రస్తుతము లభింపకపోయినను మడికిసింగన విరచించిన సకలనీతి సమ్మతమున నుదాహరింపఁబడియుండుటచేఁ దత్పరిశీలన మున వానియందలి పద్యములకన్న బద్దెన పద్యముల ప్రాశస్త్యము, మాధుర్యము విశదమగును. నీతిశాస్త్ర ముక్తావళియం దీపోలికపద్యము లీయఁబడియుండుటచే వాని నిట నుదాహరించుట చర్వితచర్వణమే యగును.

నీతిశాస్త్రముక్తావళియందలి విషయ మారంభ పద్యమునందే వివరింపఁబడియున్నది :

"రాజనీతియు సప్రధానలక్షణమును
  మంత్రిమార్గంబు దుర్మంత్రివిధము,
నధికారవిధియుఁ గార్యవిచారము నుపాయ
  గతియును రాజ్యరక్షాక్రమంబు,
ఇల నరాజకవృత్తి హితసేవకస్థితి
  దుస్సేవకక్రియ దుష్టరాజ
సేవాఫలము దానశీలతామహిమ వి
  వేకసంగతియును లోకనీతి
పద్ధతులు........."

పై విషయములపైఁ జెప్పిన పద్యములను దిక్ప్ర దర్శన మాత్రముగా నుదాహరించి యందలి యౌచిత్య ము నరయుదము.

రాజనీతులలో :

"న్యాయము ప్రజ పెక్కు గడు
ప్రాయము ప్రజకల్మి సిరి కుపాయం బగుటన్
న్యాయమె భండారము నర
నాయకులకు......"

న్యాయపరిపాలనావశ్యకత ప్రధానముగాఁ జెప్పఁ బడినది.

"ఆప్తు లెఱింగిన వాప్తుల
యాప్తు లెఱుంగుదురు తత్తదాప్త శ్రేణి
ప్రాప్త మగుచుండుఁ గావున
నాప్త పరంపరల మంత్ర మవనీం బతికిన్"

అను రాజ్యతంత్రరహస్య గోపనావశ్యకతయు,

"నయమున నఁగాని భూమిప్రజ
  నమ్మరు నమ్మఁగాని యర్థసం
చయమును తంత్రవృద్ధియును
  జాలదు చాలఁగాని శత్రులన్
బయి చని రౌర్వరాదు ప్రతి
  పక్షము డంగినఁగాని భూమి య
క్షయముగ నేలరాదు......"

అను చోటను—

"సతికన్న నబల వసుమతి
సతి పతి లేకున్నఁ జెడదు సత్యము ధాత్రీ
పతి లేనినాఁడు సద్య
చ్యుతి వసుమతికి......"

అనుచోటను

"మండలము చెడిన పతిచెడు..." అనుచోటను రాజునకును, ప్రజలకును గల యవినాభావసంబంధమును చక్కఁగాఁ దెల్పఁబడినవి.

మఱియు దానశీలతా లోకనీతిపద్ధతులందలి త్రికాలాబాధ్యములగు పరమసత్యము లద్భుతముగా నీగ్రంథమున వివరింపఁబడినవి.

"దానగుణంబ యొన్నఁగఁ బ్ర
ధాన గుణం బది మున్న గల్గినన్
గాని విశేషమై పురుష
కారము నిల్చు లోభి వాఁగఁ జ
న్నని యశంబు సత్త్వము స
హిష్ణుతయున్ విభవంబు విద్యయున్
మానము బీరముల్ వృథయ
మానిసికిన్......"

"ఎత్తినకాలఁ గాని సిరి
కెన్నఁడు నిల్చినకాల నిల్వఁగాఁ
జిత్తము లేదు కాన సిరి
చెందిన నాఁడ పరోపకారముల్
హత్తి కడంగి సేయఁ దెన
రైనఁ బదంపడి వేఁడుకొందమన్
చిత్తమె కాని యిత్త మను
చిత్తము పుట్టని యెట్టివారికిన్?"

అనుపద్యము లద్భుతములు, అనుపమానములు.

ఈతని కవిత్వమున నెన్నుట కొక్క పొల్లుమాటైన నుండకపోవుటే కాక :

"పొసఁగము తైపరుల్ పోపాళించివరీలఁ
దములోన దొరయు శబ్దములఁగూర్చి."

యన్న సూరనార్యుని నానుడికిఁ దీఁటై యీతని పద్యము లుండును. సమస్తమును విధివశ మన్న విషయ మెంతచక్కఁగాఁ జెప్పెనో చూడుఁడు :

"అలుటయుఁ గామియు విధివశ
మగు టెఱుఁగక తనవశం బె యని డెందములో
నగ చెడు మూఢుఁ గనుంగొని
నగఁ డె విధాత్రుండు..."

"కానియది కాద యరయ్యెడు
దాని కదళ్యంబు నన్యథాభావ మిలన్
గాఁజేర దింత యెఱుఁగని
మానిసి చింతాసముద్రమగ్నుఁడు కాఁడే."

"కరిసన మోపి చేసినను
కర్షుఁడిఁ గొల్చిన హీనమాడినన్
దిరిసిన ధాత్రి రోసి పర
దేశము పోయిన విద్యకల్గినన్
సిరి తనపూర్వజన్మమునఁ
జేసిన యంతియ కాక కల్గునే
పొరలిన శ్రేలఁబట్టఁ దల
పోఁతలు పోసిన నెచ్చుసూర్చినన్."

ఈతని పద్యములకూర్పు, అల్లిక జిగిబిగి, ధారాశుద్ధియు నత్యుత్తమములై, తిక్కనకుఁ బూర్వమే యిట్టి కవితాపాటవము బద్దెనరపాలునినోట వెలువడు టత్యంతామోదసంధాయకము.

"ధరణీయు తల్లి తన గనిన
తల్లియు వేల్పు గుణంబు మేని కా
ధరణము బుద్ధి రూపు కుల
భామయు సంపద బొంకు వేధ పో
దరుఁ డిలఁ బ్రాపు చంపమియు
ధర్మువు క్రోధము పాతకంబు మ
త్సరము వినాశహేతువు వి
చారమె సారము..."

ఈవిధముగనే గ్రంథమంతయు నత్యంతశ్లాఘాపాత్రముగా వెలయుచున్నది.

ఇట్టి యుత్తమగ్రంథమునకు రెండు మూఁడు విధముల ప్రతులుండుటయు నందు పాఠభేదము లధికముగా నుండుటయు, ఒక ప్రతియందు మూఁడాశ్వాసములుగా విభాగింపఁబడి యిందలి పద్యము లుండుటయు మొదలగు విషయములు కావచ్చుచుండుటచే నీ యుద్గ్రంథమును తిరిగి సవిమర్శకముగా సంపాదించి ప్రకటించు టత్యావశ్యకముగా నున్నది. ఏతత్కృతికర్త యగు బద్దెనృపాలుని కాలమునుగూర్చి సద్విమర్శకులు పరిశోధించి యాధారసహితము, నామోదదాయకము నగు నిర్ణయము గావింపవలసియున్నది.



# "హెచ్.ఎం.వి." రికార్డులలో

## వాహినీ వారి భక్త పోతన పాటలు





"హిస్ మాస్టర్స్ వాయిస్"

శ్రీ వి. నాగయ్య,
దేవి వనజ
శ్రీమతి బి. రాజరత్నం
,, హేమలత
} పాడినవి 5 రికార్డులు N. 18706–10

హెచ్. ఎం. వి.
గ్రామఫోన్ వ్యాపారులందరి
యొద్ద నేడే రికార్డులుదొరుకును.

---

దీర్ఘ కాలము ఉపయోగింపదగిన

## "హెచ్. ఎం. వి."

## హైఫిడెలిటి సూదులు




● ఒక సూది చేత పెక్కు రికార్డులను పాడించనగును.

10 సూదులు గల పాకెట్
1-కి వెల రూ. **2-4-0.**

# కాళిదాసు - జ్యౌతిషము*

= శ్రీ డాక్టరు సి. కున్హన్‌రాజా =



జ్యోతిర్విదాభరణ, శక్రుపరాభవము లను జ్యోతిషగ్రంథములను కాళిదాసు రచించినా డని సంస్కృత సంప్రదాయ మున్నది. నవీనులు నహితము కాళిదాసునకు జ్యౌతిషముతో మంచి పరిచయ మున్న దని చెప్పుచు, నాతని ఆర్యభట్టుతర్వాత వచ్చినట్లుగ పరిగణించుచున్నారు. కావున నీవిషయమును బాగుగ విచారింపవలెను.

౧. కొన్ని నక్షత్రములతో చంద్రుని సమాగమమును చెప్పుట యనిన నితనికి చాల ప్రీతి యని తెలియుచున్నది.

(అ) "కాప్యభిఖ్యా తయో రాసీ
 ద్వ్రజతోః శుద్ధవేషయోః,
 హిమనిర్ముక్తయో ర్యోగే
 చిత్రాచంద్రమసో రివ" (ర. వం. ౧-౪౬)

ఇచట చిత్రానక్షత్రముతో చంద్రుని సమాగమము చెప్పినాడు. పూర్ణచంద్రుడైన నిది చైత్రమున సంభవము.

(ఆ) "కిమత్ర చిత్రం యది విశాఖే శశాంక లేఖా మనువర్తేతే" (శా. ౩.)

ఇచట సామ్యము చంద్రలేఖతో. విశాఖతో గూడిన చంద్రలేఖవలె శకుంతల కుష్కించిపోయినది.

(ఇ) "ఏష చిత్రలేఖాద్వితీయా మౌర్వశీం గృహీత్వా విశాఖాసమీపగత ఇవ చంద్ర ఉపస్థితో రాజర్షిః" (వి. ౧.)

ఇచట కవితాత్పర్యము పూర్ణచంద్రునితో సమాగమ మని.

౨. చంద్రుని తలపెట్టకయే నక్షత్రములు రెండు చోట్ల రఘువంశపు అంతిమసర్గలలో కనబడుచున్నవి.

(అ) "తౌ విదేహనగరీనివాసినాం
 గాం గతావివ దివః పునర్వసూ" (౧౧-౩౬)

రామలక్ష్మణులు పునర్వసూనక్షత్రము లతో పోల్చబడినారు.

(ఆ) "తస్య ప్రభానిర్జిత పుష్యరాగం
 పౌష్యాం తిథౌ పుష్య మసూత పత్నీ,
 తస్మి న్నపుష్య న్నుదితే సమగ్రాం
 పుష్టిం జనాః పుష్య ఇవ ద్వితీయే" (౧౮-౩౨)

పుత్రు డను రాజుకొడుకు పుష్యుడు. కాంతిలో పుష్యరాగము నతిక్రమించిన పుష్యుడు పూర్ణచంద్రుడు పుష్యనక్షత్రమున నుండగా జన్మించినాడు. చలికాలములలో, చీకటిరాత్రులలో పునర్వసూ పుష్యములు ఆకాశమున స్పష్టముగ కనబడుటచే కవి వీనిని తీసికొనియుండవచ్చును. లేక శబ్దాలంకారార్థము పుష్‌ధాతువును గ్రహించినాడేమో!

౩. ధ్రువనక్షత్రము చుట్టును నక్షత్రములు తిరుగుచుండు నని—

"తం ప్రీతివిశదై ర్నేత్రై రన్వయుః పౌరయోషితః
 శరత్ప్రసన్నై ర్జ్యోతిర్భి ర్విభావర్య ఇవ ధ్రువం"
 (ర. వం. ౧౭-౩౫)

అని కలదు. అనేకనక్షత్రములతో నున్న ధ్రువనక్షత్రమును రాత్రు లేవిధముగ నెండకాలమున జూచుచుండునో ఆ విధముగ పౌరయోషితలు అతిథి జన్మించినప్పుడు రాజపుత్రుని చూచినారు. అనేకస్త్రీ

* శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి అనువాదము.

ఉన్నచే నక్షత్రసముదాయము లభ్యమగును. కాని ఆకసమున ప్రతిరాత్రి నక్షత్రములు ధ్రువముచుట్టు తిరుగుచున్నవి. ఈ సామ్యము శాస్త్రజ్ఞానాశ్రయమే కాని, కవితానిష్ఠమైనది కాదు.

౪. ద్విగ్రహయుతుడైన చంద్రుడు—

"భూయ స్తతో రఘుపతి ర్విలసత్పతాకం
అధ్యాస్త కామగతి సావరజో విమానం,
దోషాతనం బుధబృహస్పతి యోగదృశ్య
స్తారాపతి స్తరలవిద్యు దివాభ్రవృందం."

అను శ్లోకమున (ర. వం. ౧౩-౭౬) చెప్పబడినాడు. లంకాపురినుంచి వచ్చుచున్న రాముడు భరతుడున్న స్థలమున దిగి, భరతలక్ష్మణులను వెంటగొని విమాన మెక్కినాడు. ఆ సమయమున బుధగురువులతో కలసిన చంద్రునితో రాముడు పోల్చబడినాడు. బుధుడు ఎల్లవేళలలోను సూర్యుని సమీపవర్తియే. అతనితో చేరిన చంద్రుడు క్షీణచంద్రు డగుచున్నాడు. అదియునుగాక అట్టి చంద్రుడు గురునితో కూడి దృశ్యమాన డగుచున్నాడట! ఇది యసంభవము. ఉదకకంఠమైన మేఘుని అధిరోహించుచున్న చంద్రు డనికూడ పలికినాడు. ప్రకృతిదృశ్యమును పరిగ గమనించి చూచి వ్రాసిన వ్రాత గా దిది. జ్యోతిష శాస్త్రమునగూడ బుధ గురు చంద్రసమావేశమున విశేషమేమియు లేదు. వరాహమిహిరుడు—

"అసితసిత సమాగమేఽల్పచక్షు
ర్యువతిసమాశ్రయ సంప్రవృద్ధవృత్తిః,
భవతిచ లిపిపుస్త చిత్రవేత్తా
కథితఫలైః పరతో వికల్పనీయాః."

అని ద్విగ్రహయోగములనే వచించినాడు. (బృ. జా. ౧౪-౫) రెంటికన్న నెక్కుడు గ్రహములున్నచో రెండు రెండుగా విడదీసి చూడవలయును. రాను రాను తర్వాతి దైవజ్ఞులు మూడు, నాలుగు, ఐదు, ఆరు గ్రహముల కూటమికి ఫలముల నిచ్చినారు.

"ధన్యాన్యాల్లోకవాగ్మీ
తేజస్వీ ఖ్యాతిమాన్ విపులకీర్తిః,
బహుపుత్రభ్రాతృయుతో
బుద్ధేందు సురపూజితై ర్యుక్తః"

అని సారావళీకారుడు కల్యాణవర్మ (౧౬-౨౦),

"శీతేందుజ్ఞ సమాగమే బహుధనఖ్యాతోఽవనీశప్రియః." అని జాతకపారిజాత (౭-౧౦) కారుడు వచించినారు. వరాహమిహిర, తత్పూర్వకాలములలోనివాడైన కాళిదా సిట్టి ప్రయోగము చేసిన సమాధానము కుదురుట క్లిష్టము.

౫. సూర్యచంద్రుల నీక్రింది శ్లోకములలో చేర్కొనినాడు:

(అ) "పితుః ప్రయత్నా త్స సమగ్రసంపదః
శుభైః శరీరావయవై ర్దినేదినే,
పుపోష వృద్ధిం హరిదశ్వదీధితే
రనుప్రవేశాదివ బాలచంద్రమాః"
(ర. వం. ౩-౨౨)

క్రమక్రమముగ సూర్యకాంతిని గ్రహించుచు బాలచంద్రుడు వృద్ధిపొందునట్లు దిలీపుని రక్షణలో రఘువు అభివృద్ధి నొందుచున్నాడు.

(ఆ) "తస్మా దపావర్తత కుండినేశః
పర్యాత్యయే సోమ ఇవోష్ణరశ్మేః"
(ర. వం. ౭-౩౩)

క్షీణచంద్రుడు సూర్యుని వదలిపోవునట్లుగా ఇందుమతీ సోదరుడు అజుని విడచినాడు.

(ఇ) తమాహితౌత్సుక్య మదర్శనేన
ప్రజాః ప్రజార్థవ్రతకర్శితాంగం,
నేత్రైః పపు స్తృప్తి మనాప్నువద్భి
ర్నవోదయం నాథమివౌషధీనాం"
(ర. వం. ౨-౭౩)

నవోదయుడైన చంద్రు డనుటచే సూర్యసమీపవర్తి యగుచున్నాడు.

(ఈ) "అథౌషధీనా మధిపస్య వృద్ధౌ
తిథౌ చ జామిత్రగుణాన్వితాయాం"
(కు. సం. ౭-౧)

(ఉ) "బభౌ చ సంపర్క ముపేత్య బాలా
నవేన దీక్షావిధి సాయకేన,

కరేణ భానో ర్బహులావసానే
సంధుక్ష్యమాణేవ శశాంకలేఖా"
(కు. సం. ౭-౮)

౬. చంద్రునిలోని మచ్చ ధూమచ్ఛాయ యని—
"అవైమి చైనా మనఘేతి కింతు
లోకాపవాదో బలవాన్ మతో మే,
ఛాయాహి భూమే శ్శశినో మలత్వే
నారోపితా శుద్ధిమతః ప్రజాభిః"
(ర. వం. ౧౪-౪౦)

అను శ్లోకమున గలదు. సీత పవిత్రురా లని రామునకు తెలియును. కాని జనాపవాదమునుంచి జాగ్రత్త తీసికొనవలెను. ఇచ్చట రాముడు చంద్రునితో పోల్చబడినాడా? అప్పుడు మచ్చ సీతఛాయ కావలెను. కాని పూర్వార్ధమున నది పొసగదు. లేక సీతకు చంద్రునకు సామ్య మాపాదింపబడినదా? జనాపవాదమువలన ఆమెలో మచ్చ యేర్పడియుండవలెను. కాని పుంలింగవాచకములతో స్త్రీలు పోల్చబడరు. ఈ శ్లోకమున గ్రహణపరామర్శ యేమియు లేదు. కాని "అంకం కేచి" అను శ్లోకములోని "ధూమచ్ఛాయ మైచ్ఛన్ శశే" అను సుప్రసిద్ధ భావమే ఇచ్చట నుడువబడినది.

౭. సూర్యుని ఉత్తరదక్షిణగమనములను గురించి వాక్యములుకూడ కలవు.

(అ) "తతః ప్రతస్థే కౌబేరీం
భాస్వానివ రఘు ర్దిశం,
శరై రుస్రై రివోదీచ్యా
నుద్ధరిష్యన్ రసానివ" (ర.వం.౪-౬౬)

ఉత్తరదిగభిముఖుడైన సూర్యుడు సముద్రమునుంచి ఉదకములను స్వీకరించుచున్నాడు. ఈ సందర్భమున "సహస్రగుణ ముత్స్రష్టు మాదత్తేహి రసాన్ రవిః" (ర. వం. ౧-౧౮) ఇత్యాది పంక్తులను జ్ఞప్తి యందుంచుకొనవలెను.

(ఆ) "అగస్త్యచిహ్నా దయనా త్సమీపం
దిగుత్తరా భాస్వతి సన్నివృత్తే,
ఆనందశీతామివ బాష్పవృష్టిం
హిమస్రుతిం హైమవతీం ససర్జ"
(ర. వం. ౧౬-౪౪)

కుశుని కాలమున గ్రీష్మాగమ సందర్భమందలి దీ శ్లోకము. ఉత్తరదిక్ప్రాంతములను సూర్యుడు చేరు సరికి, హిమాలయములమీద హిమరూపముతో నుత్తర దిక్కు ఆనందబాష్పములను విడచినది. అనగా మంచు కరగుట నారంభించినది.

(ఇ) "ప్రయయా వాతిథేయేషు
వస న్నృషికులేషు సః,
దక్షిణాం దిశ మృక్షేషు
వార్షికేష్వివ భాస్కరః" (ర. వం. ౧౨-౨౫)

శీతకాలమున దక్షిణదిక్కుకు పోయి నక్షత్రముల మధ్య సూర్యు డుండునట్లు, అరణ్యవాసమున రాముడు ఋష్యాశ్రమముల కేగి వారి యాదర మందినాడు. కాని నక్షత్రములమధ్య సూర్యు డుండు వేళ యేదో విచారణమీదగాని తేలదు.

(ఈ) "కుబేరగుప్తాం దిశ ముష్ణరశ్మౌ
గంతుం ప్రవృత్తే సమయం విలంఘ్య,
దిగ్దక్షిణా గంధవహం ముఖేన
వ్యలీకనిశ్వాసమివోత్ససర్జ" (కు.సం.౩-౨౫)

౮. రాహు వొకసారి సురద్విట్టని, మరియొక సారి గ్రహమని చెప్పబడినాడు:

(అ) "ఉపస్థితా శోణితపారణా మే
సురద్విష శ్చాంద్రమసీ సుధేవ"
(ర. వం. ౨-౩౯)

(ఆ) "సంధ్యాభ్రకపిశ స్తస్య
విరాధో నామ రాక్షసః,
అతిష్ఠ న్మార్గ మావృత్య
రామస్యేందో రివ గ్రహః" (ర. వం. ౧౨-౨౮)

చంద్రుని మార్గమున గ్రహము కనబడునట్లు రామునికి విరాధుడు కన్పించినాడు. రాహువు వెంటనే చంద్రుని కబళించునుకాని, రాముడు విరాధునిచే నట్లు గావింపబడక, వెంటనే అతని దునిమెను. ఇది అసమగ్రము, అసమంజసము నగు సామ్యము. వరాహమిహిరుడు రాహుకేతువులను గ్రహములుగ స్వీకరింపలేదు.

"అమృతాస్వాదవిశేషా
చ్ఛిన్నమపి శిరశి లాసుర స్యేదం,

ప్రాశై రపరిత్యక్తం
గ్రహాణాం యాతం వదం త్యేకే"

(బృ. స. ౫-౧)

అని పూర్వాచార్య లంగీకరించినా రనినాడు.

౯. గ్రహములలో కొన్ని కాళిదాసుచే శ్లే షింపబడినవి.

(అ) "దృష్టిప్రపాతం పరిహృత్య తస్య
కామః పురశ్శుక్రమివ ప్రయాణే"

(కు. సం. 3-౪3)

అని పురశ్శుక్రదోషము చెప్పినాడు.

(ఆ) "యావదంగారకో రాశి మివానువక్రం ప్రతిగమనం వకరోతి" (ము. అ. 3)

పాపరాశికి అంగారకుడు వచ్చునట్లు ఇరావతి మరల వచ్చులోపలనే రాజు తప్పించుకొనిపోవలె నని విదూషకుని పలుకు. వక్రగతి నొందిన కుజుడు పాపి. ముఖ్యముగ నష్టమకుజుడు.

(ఇ) "ప్రకృతివక్రః స కస్య అనునయం గృహ్ణాతి"

(అ. శా. 3)

దుర్వాసుడు నైసర్గికపాపులగు కొందరి గ్రహములవలె ప్రకృతివక్రుడు. వక్రశబ్దము అంగారకవాచి కూడ.

౧౦. గ్రహ, నక్షత్రముల స్థితివలన శుభవేళలు కలుగుచున్న వను వాక్యములుకూడ గలవు.

(అ) "అథౌషధీనా మధిపస్య వృద్ధౌ
తిథౌచ జామిత్రగుణాన్వితాయాం"

పుత్రికావివాహ సందర్భమున హిమవంతుడు జామిత్రగుణాన్వితమైన తిథిలో, చంద్రుడు వృద్ధి పొందుచున్నప్పుడు దీక్షను గ్రహించినాడు. లగ్నాత్సప్తమము జామిత్రస్థానము. గ్రహరాహిత్యతయే తచ్ఛుభత్వకారక మని మల్లినాథుని అభిప్రాయము. జామిత్రశబ్దము గ్రీకుభాషలోని diametros నుంచి యుత్పన్నమైన దని ఒకవాదము కలదు. దీని కర్థము "the diameter or diagonal of a parallelogram" అని. ఇది వ్యుత్పత్తిసహితము. సంస్కృత వ్యుత్పత్తి చెప్పుట కష్టసాధ్యము. సప్తమస్థానము జాయావిషయక మగుటచే నీశబ్దము 'జాయామిత్ర' శబ్దభవమని కొందరి మతము. ఇది అహోరాత్రము నుంచి హోరాశబ్దము వచ్చినదను బృహజ్జాతకోక్త (౧-3) నిర్వచనమువంటిది. సంస్కృతజ్యోతిషమున ననేకగ్రీకుపదములు కలవు. బృహజ్జాతకమందలి—

"క్రియ, తావురి, దితుమ, కులీ
ర, లేయపార్థోన, జూక, కౌర్పా ఖ్యః
తౌక్షిక, ఆకోకేరో,
హృద్రోగ, శ్చాంత్యభం చేత్థం" (౧-౮)

అను రాశిపర్యాయములు చాలవరకు గ్రీకుభాషలోనివే. పైగా హోలి, హిమ్న, అర, జ్యా, ఆస్ఫుజిత్, ద్రుక్కాణ, లిప్త, అనఫ, సునఫ, దురుధర, కేమద్రుమ, హారిజ, వేశి, అపోక్లిమ, పణాఫర, హిబుక, ద్యూతం, మేషురణ ఇత్యాదు లన్నియు గ్రీకుభాషలోనివే.

కాని గ్రీకుభాషలోని యర్థముతో సంస్కృతమున జామిత్రశబ్దము ప్రయోగింపబడుట లేదు. సప్తమరాశినే జామిత్ర మని యందురు. ఈశబ్దము భారతదేశమునకు గ్రీకుల జ్యోతిషము రాకమునుపే వచ్చినది. రాశిచక్ర మొకటి అములులో నున్నప్పుడు సంస్కృతమున నీశబ్దము ప్రయోగింపబడుచువచ్చినది.

మేష, వృషభేత్యాదిశబ్దములను కాళిదాసు వాడలేదు. మాసములను వ్యవహరించవలసివచ్చినప్పుడు తన్నక్షత్రములను, నభశ్శబ్దమును వాడినాడు:

"ఆషాఢస్య ప్రథమదివసే" (మే. దూ. ౧-౨)
"ప్రత్యాసన్నే నభసి" (మే. దూ. ౧-౪)

కాళిదాసు కాలమునాటికి రాశిచక్ర విభాగ మున్నది. గ్రహముల నుచ్చనీచాది వ్యవస్థకూడ తెలియును. క్రీస్తుపూర్వపు శతాబ్దములలోకూడ, గ్రీకు జ్యోతిషమును గురించి తెలియుటకు ముందే, భారతీయులకు జ్యోతిషపరిచయము కలదు.

(అ) "మైత్రే ముహూర్తే శశలాంఛనేన
యోగం గతా సూత్తర ఫల్గునీషు"

(కు. సం.

ముత్తైదువు లీముహూర్తమున పెండ్లికుమార్తెయైన పార్వతి నలంకరించినారు. సూర్యోదయ మైన

తెల్లవారుజామున మూడవ యామమున మైత్రముహూర్తము. చంద్రు డుత్తరఫల్గునీయుతుడైన వేళ శుభదాయక మట. శుభసూచకముగ నుత్తరఫల్గునీశబ్దమును నేటికి కూడ మలబారుదేశీయు లుపయోగింతురు. "కుమారు నికి ఉత్తరఫల్గుని వచ్చునరికి తండ్రి మరణించియుం డు"నని సామెతకూడ కలదు. దీనితో నక్షత్రముల సంఖ్య ఆనాటికే ఇరువదియేడని నిశ్చితమైన దని తెలి యుచున్నది.

౧౧. మాలవికలోని "సోపసర్గం వో నక్షత్రం" (౪ అం.) అను పంక్తిలో కొన్ని నక్షత్రము లశుభదా యకము లని చెప్పబడినది. మాలవిక కారాగృహమున నున్నది. నక్షత్రదోష ముండుటచే తచ్ఛాంత్యర్థము బాధింపబడినవారి నందరిని ప్రభువు వదలివేయుమని వాడని విదూషకుడు భద్రకునితో నన్నమాట లివి.

౧౨. రాహువు చెప్పబడిన రెండు శ్లోకములు పూర్వ మీయబడినవి. గ్రహణముల సంగతి యనుమే యము. శాకుంతలములోని

"ఉపరాగాంతే శశినః
సముపగతా రోహిణీయోగం" (౭-౨౨)

అను ప్రదేశమున గ్రహణము స్పష్టముగ చెప్ప బడినది. ఈవాక్యమును ౧. అ, ఆ, ఇ-ల క్రింద నుదా హరింపబడిన పంక్తులతో పోల్చి చూడవలయును. విక్రమోర్వశీయమున (౧-౧౦) గూడ గ్రహణ ముచ్చ రించబడినది.

౧౩. గ్రహములనుగూర్చి పలికిన వాక్యములు కొన్ని కలవు.

"సత్య మర్కాచ్చ సోమాచ్చ
పర మధ్యాస్మహే పదం" (కు. సం. ౬-౧౯)

సూర్యచంద్రులకన్న ఎక్కువ యెత్తులో నున్నామని సప్తర్షు లనుచున్నారు. భూమినుంచి గల సరియైన దూరము గా దిది. కాని జగత్తులోని కొన్ని విభాగాలను గూర్చిన వాక్యమిది.

౧౪. "బ్రాహ్మే ముహూర్తే కిల తస్య దేవీ
కుమారకల్పం సుషువే కుమారం"
(ర. వం. ౫-౩౬)

అను శ్లోకములో ముహూర్తశబ్ద మున్నది. మైత్ర ముహూర్తము కు. సం. ౭-౬ లో కనబడుచున్నది.

౧౫. మాసములు, కాలవిభాగములు కూడ పేర్కొనబడినవి. ఋతువులు సహితము కలవు. నిద్రనుంచి విష్ణువు మేల్కొను కాలమునుగురించి "శాపాంతో మే భవతి భుజగా దుత్థితే శార్ఙ్గపాణౌ" (మే. దూ. ౨-౪౭) అను శ్లోకమున పలికినాడు. కాని వీటికి, జ్యోతిషమునకు సంబంధము లేదు.

౧౬. రఘువు పుట్టినప్పుడు ఐదు గ్రహము లుచ్చలో నున్న వని—

"గ్రహై స్తతః పంచభి రుచ్చసంస్థితై
రసూర్యగైః సూచితభాగ్యసంపదం"

అని (ర. వం. ౩-౧౩) పలికినాడు. ఈ ఉచ్చ స్థిత గ్రహములకు సూర్యసంపర్కముకూడ లేకపోవుటచే భాగ్యసంపదను సూచించుచున్నవట! ఈశ్లోకార్థ మేమి? "ఐదుగ్రహము లుచ్చలో నున్నపుడు"అని యర్థమా?

బుధుడు సూర్యుని సమీపవర్తి. బుధుని కుచ్చ కన్య; సూర్యునికి మేషము. కావున వీరిద్దరికి నేక కాలమున ఉచ్చస్థితి సంభవము కాదు. అదేవిధముగ మీనము నుచ్చ గలిగిన శుక్రునకును బుధునితోపాటు ఉచ్చస్థితి రాదు. కావున వరాహమిహిరుని సప్త గ్రహములలో నారింటికిమాత్రమే ఉచ్చ ఏకకాలమున కలుగవచ్చును. కాళిదాసిచ్చిన పంచగ్రహోచ్చస్థితిని తత్పూర్వకాలీను లనదగిన జ్యోతిష్కు లెవ్వరును స్మరించలేదు.

"ఐదు గ్రహములు ఉచ్చలో నున్నప్పుడు"అని తీసికొనినచో కాళిదాసురోజులలో సూర్యచంద్రులు గ్రహములుగా పరిగణింపబడలే దని యనవలసివచ్చును. కాని అప్పుడుకూడ బుధుని పరిహరించగా, నాలుగు గ్రహములకే ఉచ్చరాసులు లభ్యమగును. ఉచ్చలో నున్న గ్రహములు బలిష్ఠము లని అతనికి తెలియును. కాని ఐదింటికి ఒకేసారి ఉచ్చ లభ్యమగునా, కాదా యని విచారించక, ఉచ్చ శుభప్రద మగుటచే, ఉన్న ఐదింటికి నుచ్చరాశి నొసగినాడు.

వేదములలో గ్రహములనుగురించి యేమియును లేదు. తర్వాత తర్వాత కుజ, శని, బుధ, గురు, శుక్రులే గ్రహములుగ స్వీకరించబడినారు. రవి, చంద్రులు తర్వాత చేర్చబడినారు. వరాహమిహిరుడు రాహుకేతువులను స్వీకరించలేదు.

కాళిదా సిట్లు రవి, బుధ, శుక్ర లేక కాలమందు ఉచ్చరాశిలో నున్నట్లు సత్యదూరముగ వ్రాయగలడా యనిన, తత్తుల్యదోషము నొకదానిని ఒనరించినాడు కావున నిట సాకల్యపడవలసిన యవసరము లేదని నాయభిప్రాయము.

౧౪. ఆరోపము— రోహిణీనక్షత్రయుక్తుడైన చంద్రుడు సాయంకాలమున నుదయించుచుండగా, నతని సేవించుటకు రాణినికూడ రావలసినదిగా విక్రమోర్వశీయములో రాజా కోరినాడు.

"దేవీ విజ్ఞాపయతి మణిహర్మ్యపృష్ఠే సుదర్శన శ్చంద్రః తత్ర సన్నిహితేన దేవేన ప్రతిపాలయితు మిచ్ఛామి యావద్రోహిణీ సంయోగ ఇతి" (3 అం)

అని కలదు. అది సాయంసమయ మని తత్పూర్వమే "కహ మిహాక్షేర ఉంహోణ మత్థమిదో సుజ్జో" అని పలికిన విదూషకుని వాక్యమువలన తెలియుచున్నది. సూర్యాస్తమయమైనవెంటనే తూర్పున చంద్రుడుదయించుచున్నయెడల, నది పూర్ణిమాప్రాంతమని మనకందరకు తెలిసిన విషయమే. "దారిఆహ్మో ఉవణేధ ఓవహారిఅం జావ మణిహమ్మ్యఅగదే చందపాదే అచ్చేమి" అను వర్ణనవలనకూడ పూర్ణచంద్రుడేనని తెలియుచున్నది. రోహిణీయుక్తుడగు పూర్ణచంద్రుడు మనకు కార్తిక, మార్గశిరమాసములలోనే కన్పించును. వసంతానంతరము గ్రీష్మప్రారంభము కాగా సూర్యుని పూజించవలె నని "వసంతాణంతరే ఉణ్హాసఏ భావం సుజ్జో మఏ ఉవచరిదవ్వో" (3 అం) అను చిత్రలేఖా వాక్యమువలన నిది గ్రీష్మకాలమని, అనగా జ్యేష్ఠమాస ప్రాంత మని తెలియుచున్నది. కావున ఒకవాక్యమువలన కాలము జ్యేష్ఠమని, మరియొకదానివలన కార్తిక మార్గశిరము లని తేలుచున్నది. అనూరాధానక్షత్రము తర్వాత రోహిణీనక్షత్రము యజుర్వేదతైత్తిరీయ సంహితలో (౪-౧౦) నుచ్చరింపబడుటచే రోహిణి యన జ్యేష్ఠ యని చెప్పవచ్చును. కాని ఇది యుక్తియుతము కాదు. ఇక్కడ రోహిణి యన కృత్తికానక్షత్రము తర్వాతిదే నని చెప్పకతప్పదు. పైస్థలమున, నిక్కడ గూడ కాళిదాసు తాను వ్రాయునది జ్యోతిశ్శాస్త్రోచితమా, కాదా యని విచారించలేదు. శుభప్రదమైన చిహ్నముల నన్నింటిని స్మరించవలెనని, రఘుజన్మకాలమున పంచగ్రహోచ్చ కలదని, తన కాలమందు గ్రహములుగా నెంచబడిన ఐదింటిని స్మరించినాడు.

వీటన్నిటినిబట్టి విచారించగా కాళిదాసునకు జ్యోతిషముతో నంత పరిచయము లేనని తేలుచున్నది. ఆర్యభట్ట, వరాహమిహిరాదుల గ్రంథములలో విస్తృతముగా ప్రపంచింపబడిన జ్యోతిషజ్ఞాన మాతని గ్రంథములలో నెచ్చటను కానరాదు. నక్షత్రములు, వానితో కలిగెడు చంద్రసమాగమము, సూర్యుని ఉత్తరదక్షిణ చారలు, ధ్రువాదినక్షత్రములు, కొన్ని గ్రహములు, వాటికి మానవజీవితముపై గల ప్రభావము (Influence) మొదలైన ఇట్టి విషయములు మాత్ర మతనికి తెలియును. ఆర్యభట్ట, వరాహమిహిరుల గ్రంథముల కేమాత్రమైన సూచనలును లేవు.

కాళిదాసులో కనబడెడు కొన్ని జ్యోతిష విషయములు తర్వాతిరోజులలో స్థిరముగ నిలచిపోయినవి. "సప్తమమున గ్రహరాహిత్య"మని మల్లినాథు డర్థము చెప్పిన 'జామిత్రగుణ' శబ్దము ఆయర్థములోనే వ్యవహరింపబడినది. విద్యామాధవీయములో వివాహ విషయమున,

"ఇందోః కామే దశశతకశే వల్లభే నోజ్ఝితా స్యాత్
తస్మిన్ వధ్వా దయితమరణం భూమిపుత్రో విధత్తే,
వీర్యోపేతా రవిజశశిజౌ ప్రేయసో దుర్బలత్వం
పాపాచారా యువతి రశుభైర్దృష్ట ఇందో యుతేవా"

అను శ్లోకము (౮-౪౦)కలదు. దీనిపై విష్ణుశర్మ రచించిన 'ముహూర్త దీపికా' వ్యాఖ్యలో

"ప్రాగ్లగ్నా చ్చంద్రాద్వా
సర్వే జామిత్రగా వశుభదాస్యుః"
"క్రూరో యదివా సౌమ్యో
లగ్నా చ్చంద్రాచ్చ ఖేచరః

ఏకోవా యది జామిత్రే
　　పత్యుః ప్రాణహరో భవేత్"
　　　　　　　　　　　(సప్తర్షి మతములోనిది)

"జామిత్రగా నేష్టఫలాస్తు సర్వే
　　లగ్నాచ్ఛశాంకాచ్చ వదంతి కేచిత్"
　　　　　　　　　　　(వామదేవునిది)

అను శ్లోకము లుదాహరింపబడినవి. వీటినిబట్టి చూడ సప్తమమున గ్రహరాహిత్యమే వివాహమునకు శుభ మని యెంచినారని తేలుచున్నది.

కుజుని వక్రగతినిగురించి బృహత్సంహితలో

"యద్యుదయర్క్షా ద్వక్రం
　　కరోతి నవమాష్టసప్తమర్క్షేషు
　　తద్వక్ర ముష్ణ ముదయే
　　పీడాకర మగ్నివార్తానాం"　　(౫-౧౬౬)

అని కలదు. కాళిదాసునకు మాలవికాగ్నిమిత్రమున "జావ అంగారో రాశింవిఅ అణువక్కం వడిగ మణం ణకరేది" (3 అం.) అని వ్రాయునాటికి కుజుని వక్రగతి అశుభకర మని తెలియును.

పంచగ్రహోచ్చ (ర. వం. 3-౧3)స్థితిని గూర్చి స్వల్పజాతకములో వరాహమిహిరుడు కొంత వివరించినా డని బృహజ్జాతక వ్యాఖ్యాత ఉత్పలుడు—

"యతస్తేన (వరాహమిహిరేణ) సామాన్యేనైవ స్వల్పజాతకే ఒభిహితం—

త్రిప్రభృతిభి రుచ్చస్థై
　　ర్నృపవంశభవా భవంతి రాజానః
పంచాదిభి రన్యకులో
　　ద్భవాశ్చ తద్వత్త్రికోణగతైః"
　　　　　　　　　　(బృ. జా. ౧౧-౧ వ్యాఖ్య)

అని వ్రాసినాడు. బృహజ్జాతకమునందే—

"ఉచ్చస్వత్రికోణగై ర్బలస్థై
స్త్రిప్రభృతిభిర్భూపతివంశజా నరేంద్రాః
　　పంచాదిభి రన్యవంశజాతా
　　హీనైర్విత్తయుతా నభూమిపాలాః" (౧౧-౧౧)

అని వరాహమిహిరుడు వచించినాడు. బృహజ్జాతకమందలి ౧౧-౧ శ్లోకముపైని ఉత్పలవ్యాఖ్యలో "వరాహమిహిరస్య యవనేశ్వరమత మభిప్రేతం"అని చెప్పి పైనుదాహరించిన లఘుజాతకశ్లోక మీయబడినది. దీని వలన నీపంచగ్రహోచ్చస్థితి యను నభిప్రాయము వరాహమిహిరాత్పూర్వమే కలదని తెలియుచున్నది. కావున "గ్రహైః స్వతః" (ర. వం. 3-౧3) అను శ్లోకమున "గ్రహములలో నై"దని చెప్పకొనినను, కాళిదాసు వరాహమిహిరుని తర్వాతివా డనుట కాధారమేమియు లేదు. ఈవిషయమై జాతకపారిజాతముకూడ

"పట్సు గ్రహేషు స్వోచ్చగృహస్థితేషు
రాజాధిరాజః కిల భూపతిః స్యాత్,
ఉచ్చంగతైః పంచభి రింద్రవంద్యో
లగ్నస్థితే సర్వజనావనీశః"　　(౮-౮౧)

అని చెప్పుచున్నది.

ప్రయాణమునకు శుక్రదోషమునుగురించి విద్యామాధవీయములో,

"యద్దిగ్భవ్యవలిప్తతే భృగుసుత
　　స్తాం యోదిశం వామతః
కిం కృత్వా ప్యథ సంప్రయాతి స తతో
　　నావర్తతే దుర్మతిః"　　(౧౨-౫)

అని కలదు. వ్యాఖ్యాతయగు విష్ణుశర్మ తత్ప్రోద్బలకముగా గర్గ, ఋషిపుత్ర, సమాసయాత్రా, అత్రి, గురు, వరాహమిహిరాదుల నుదాహరించినాడు.

సామ్యముకొరకు కాళిదాసు తెచ్చిన నక్షత్రములు చాలవరకు మహాభారతములోనే కలవు. ఆ కాలములో నవి యందరకును సుపరిచితములై యున్నవి. కాళిదా సీజ్యోతిషాదివిషయములో కేవలజాతీయ సంప్రదాయములనే అనుసరించినాడు.

అగ్ని, మోటారుకారు

భీమాకు



**యునైటెడ్ ఇండియా**

ఫైర్ అండ్ జనరల్

ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్,

యునైటెడ్ ఇండియా లైఫ్ బిల్డింగు,

ఎస్ప్లనేడ్, మద్రాసు.

టెలిఫోన్ : 4241.

Grams : "UNIGEN"

పోస్టుబాక్సు : 1207.



**డోంగ్రే గారి**

**బాలామృతము**

బలహీనమైన బిడ్డలకు
పుష్టియున్నూ, బలమున్నూ
ఆరోగ్యము నిచ్చును.



**మీ వెండ్రుకలను కాపాడుటకు సాధనము**

మీ వెండ్రుకలను కాపాడుకోవటం మీ చేతుల్లోనే వుంది... చాలా సులభం. కేశములు పెరగటానికి చాలా తోడ్పడుతుంది. వాటి అందాన్ని కాపాడుతుంది—ఒక సీసా

**కామినియా నూనె** (రిజిష్టర్డు)

ఆపని చేస్తుంది... మరపురానిది... దాని అద్వితీయమైన సువాసన — పేరుకు తగినట్లు పని చేస్తుంది.

1 సీసా రు. 1. 3 సీసాలు రు. 2/13.

**ఒట్టో డిల్ బహార్** (రిజిష్టర్డు)

అది మనోహరమైన అత్తరు - అసాధారణమైనది. దానితో పోల్చదగినది యింకొకటి లేదు.

పె. సీసా రూ. 1/8/- డ్రాం సీసా రూ. 0-14-0

సోల్ యేజెంట్లు:—

ఆంగ్లో ఇండియన్ డ్రగ అండ్ కెమికల్ కంపెనీ,

బొంబాయి, 2. No.



# భవభూతి సీత*

= శ్రీ కీ. శే. కపిస్థలం కృష్ణమాచార్యులు =

సీత చూలాలు ; ఉబుసుపోకకు బొమ్మలు చూస్తోంది. వాటిని చూడనుచూడనూ తన జీవితంలోని ప్రతి చిన్న విషయమూ మనసులో తోచిపోతున్నాయి ఆమెకు. రాముడూ, లక్ష్మణుడూకూడా ఆ బొమ్మల్నే చూస్తున్నా, ఆ చూడటంలోగాని, ఆ చూపటంలో గాని ఆమె కున్నంత సరదా వాళ్లెవళ్లకీ లేదు. మరదళ్లను చూపుతూ చూపుతూ లక్ష్మణుడు ఊర్మిళపే రెత్తుకుంటే, సీత, "అయితే, వీ రెవరండీ?" అని ఆమెకేసి చూపుతూ అడుగుతుంది బలే గమ్మత్తుగా. అమరవాహినీ తీరంలో ఆ పుణ్యాశ్రమాలను చూస్తోంటే, అక్కడి మునిపత్నులతో తాను హాయిగా గడపిన రోజులు జ్ఞాపకం వచ్చి, ఆ ప్రాతస్నేహితులతో మళ్లీ కొంత కాలం వెళ్లబుచ్చాలని వుబలాటపడుతుంది సీత. ఆకోరిక వినటంతోటే రాముని లేత మనసు కరిగిపోతుంది: 'సరే' నంటాడు. ఇక, ఆబొమ్మల్లో దండకారణ్య దృశ్యాలు వచ్చేసరికి మరీ రసవంతం అయిపోతాయవి. ఆ అరణ్యంలో తాము పడ్డ పాట్లు దంపతులకు కళ్లకు కట్టినట్టున్నాయి బొమ్మల్లో. అవి చూస్తోంటే రాముడికి కళ్లల్లో తడి యారటమే లేదు. "ఇహ చూడలేను బాబూ" అంటూ ఆ బొమ్మలు చూడటం అంతటితోనే ఆపేస్తాడు. అప్పటికే కునికిపాట్లు పడుతున్న సీతా అక్కడే నిద్రపోతుంది హాయిగా.

ఎకాయెకీ అక్కడికే వస్తాడు దుర్ముఖుడు- ఏమో పుట్టి మునిగినట్టు! తన పాడువార్తా, తానూ! ఇటు ప్రేమ; అటు ధర్మం— ఏమి చెయ్యనూ పాలుపోవటం లేదు, పాపం, రాముడికి. అయితేమాత్రం ఎంత

* 'The Heroines and the Child-heroes of the early Sanscrit Drama' అని మా తండ్రిగారి అముద్రిత ఆంగ్ల గ్రంథం ఒకటి వున్నది. అందులోని ఒక వ్యాసానికి ఇది నా తెనుగు తర్జుమా.

— కపిస్థలం శ్రీరంగాచారి.

నే వలా వుండగలుగుతాడు? యమయాతన పడి, చివరి కెలాగో గుండె రాయిచేసు కుంటాడు. ఎండకన్నెరుగని నిండు చూలా లిని-తన నీడ, తన ప్రాణం అయిన సీతా మహాదేవిని కీకారణ్యంలో దిగబెట్టిరావటం తప్పనిసరి యైపోయింది. ఇంతటి రాక్షస కృత్యం చెయ్యవలసివచ్చినందుకు మనసారా శపించుకుంటాడు తన్నుతాను. పవిత్రప్రణ యానికి తాను చేసింది మహాపాతకం అని తెలుసు. కాని, ప్రజకోసం తనేదో మహా చేశా డనుకుని ఓదార్చుకుంటాడు తన్ను. అదుగో, అక్కడ నిద్రపోతోంది సీత, ఏ పాప మెరుగని పసిపాపలాగు. ఆమె లేక తన ప్రాణం మాత్రం ఎందుకూ?... ఎంత విశ్వాసంతో, ఎంత హాయిగా నిద్రపో తోంది! ఒక్కక్షణంలో ఎంత జరిగింది! ఆమెకు యీనిద్రా, యీహాయీ మళ్లీ దొరుకుతాయా, కలలోగానీ? క్రూర జంతువులూ, దుష్టరాక్షసులూ స్వైరవిహారం చేసే ఆ నదీతీరంలో,ఆ అరణ్యగర్భంలో ఏమి కాబోతోందో సీత! ఆమెతో అర్ధాంగినే కాదు, సంతాంకురాన్ని త్యజిస్తున్నాడు రాముడు. ఈ కృత్యం మహాభయంకరం. ఇది తలచటంకూడా దుర్భరం. ఏలాగూ చేసికావాలిగా? మరి దారి లేదామె! తను కర్మఖండాలునికన్నా నాసిరకం అయిపో య్యాక, తన సీతను- ఆ పునీతను సమీపిం చటానికీ తగడు తాను. అలా మెల్లిగా ఆమెతలక్రిందినుండి తన చేతిని తీసి, మన సులో మన్నన కోరుతూ, జాలిగా పడతాడు ఆమె అడుగులముందు. "ఇక క్షణంలో వది లెయ్యటం తప్పదు. ఆపని యిప్పుడే చెయ్య టం మంచిది కాదూ?" అనుకుని, ఆమె నక్కడే నిద్రపోనిచ్చి, తా నివతలకి వచ్చే స్తాడు రాముడు.

సీత నిద్రలేచింది. తాను కన్న పాడు కల నిజంలాగే తోస్తోంది. కాకుంటే, ఏడీ స్వామి? ఎప్పుడు వెళ్లాడో, ఎక్కడికి వెళ్లాడో!...రానీ మళ్లీ. ఏం జేస్తుందో తెలు స్తుం దప్పుడు...ఇంతకూ కోప్పడటం—అదీ, అతనిమీద! — తన చాతనవుతుందా? ఏమో!—ఇలాంటి పిచ్చితలపుల్లో మునిగి తేలుతోందేకాని, జరిగిందేమో ఆమె ఎరుగదు. తన స్వామి- తన ప్రాణం- తన సర్వస్వం, తనేమో కోరిందని, ఆవంక పెట్టి, అమానుషంగా అంతటి అన్యాయమే చేస్తాడని ఆమె కెలా తెలుస్తుంది మరీ?

రాముడేమో ఆమెమీద జాలిమా లినా భూమాతా, గంగాంబా మాత్రం ఆదుకున్నా రామెను, ఆపత్కాలంలో. ఆమె యిప్పుడున్నది పాతాళంలో. అక్కడే కన్నది కవలను. ముద్దులొలికే ఆ మొహాలు చూస్తూ, తీరని వేదన తరిగించుకుంటుంది, పాపం! అదీ ఎంతకాలం? చనుబాలు మరవలేనంతవరకే. ఆప్రాయం రాగానే, వాల్మీకిప్రాపులో పెరుగవలసివుండటంచేత, తల్లిమొహం దూరమైంది పిల్లలకు. సీత భర్తను చూడరాదుకదా, ఇక బిడ్డల్ని చూడబోదు. క్షణ మొకయుగంగా గడుపు తోంది జీవితం. పిల్లల్ని కంటేమాత్రం?— ఆ పాలబుగ్గల్ని భర్త ముద్దాట్టం చూచి పొంగిపోవద్దూ? ఇంతకూ నోమునోచినమ్మ కాదుగా తను!

రాముడుమాత్రం ఏం సుఖిస్తున్నా డని?—సీతకంటే కుంగిపోతున్నాడు, పాపం. అహోరాత్రాలూ ఒకే వేదన, ఒకే

యాతన—"అల్లాంటి యిల్లాలికి అంతటి అన్యాయం చేశానే" అని. నిద్ర, ఆహారం—అంటే ఏమిటీ అంటాడు. కాని, రాముని యీస్థితీ, యీగతీ సీతకు తెలిస్తేనేగాని లాభం లేదు. ఆమెదీ అదృష్టం—వియోగంలో ఒక్కసారి అతని అమృతస్పర్శలో ఆమె ఒళ్లుమరిచింది.

దండకారణ్యం. సవితృపూజకోసం గోదావరిలోనుండి వస్తోంది సీత. అప్పుడు చూస్తుంది, వనదేవత వాసంతితో చిరపరిచిత దృశ్యాలు చూస్తున్న రాముణ్ణి. నిజంగా భవభూతి తన పనితనం చూపింది యిక్కడే. ఈ సన్నివేశం కాళిదాసుకళకు వన్నెలు దిద్దింది. దుష్యంతుని పశ్చాత్తాపం శకుంతల చూడలేదు; సానుమతి చెప్పితే వినింది, అంతే. కాని, యిక్కడ- తన వియోగం రాముని గుండె నెలా నమిలి మ్రింగుతోందో కళ్లారా చూస్తుంది సీత. చూచి ఏడుస్తుంది; చూడలేక మూర్ఛపోతుంది. అతని కింతటి కష్టం కలిగించినందుకు తన్ను తాను ఆడిపోసుకుంటుంది. ఈయడవిలోనే సీతతో అనుభవించిన స్వర్ణముహూర్తాలు జ్ఞాపకం చేస్తూ వాసంతి రాముని వేధిస్తూంటే, ఆమెను నిందిస్తుంది సీత. ఆమె తిరస్కరణిలో వుండబట్టి రాముడామెను చూడలేదు. ఆమె యేమో రాముని కళ్లారా చూచి, మధుకీలలంటే ఏమిటో, అనుభవించి తెలుసుకుంది.

వీరి వియోగం ముగియవస్తోంది. వశిష్ఠాదులు ఋష్యశృంగుని ఆశ్రమంనుండి వస్తూ, సీతకు జరిగిన అన్యాయం విని, అయోధ్యలో అడుగు పెట్టరాదని నిశ్చయించుకుంటారు. ఏ అడవిలోనో కళ్లు మూసుకుని కాలం గడుపుదా మనుకుని వాల్మీకిఆశ్రమానికి వెడతారు. యాగాశ్వం వెంట రామలక్ష్మణాదులూ అయోధ్యనుండి అక్కడికే వస్తారు. రాకరాక వచ్చిన అతిథుల్ని ఆదరించటానికని అంతర్నాటకం తయారుచేశాడు వాల్మీకి. అందులో అప్సరసలు ఆడతారు. కథ సీత జీవితం; అడవిలో విడిచినచ్చినప్పటినుండి. తన వేషం తానే వెయ్యటానికి పాతాళంనుండి వచ్చివున్నది సీత. నాటకం సాంతంగా చూడటం దుర్భరమవుతోంది రాముడికి. ఆఖరుకు, అరుంధతి మూలాన్ని మళ్లీ కలుసుకుంటారు సీతా, రాముడూ, మంగళం పాడుతోంటే మైమరుస్తారందరూ.

సంస్కృతంలో, నాటకనాయికల్లో భవభూతిసీత అతిలోకసృష్టి. ప్రేమ, సహనం, అమాయికత్వం అన్నీ యింద్రచాపంలోలాగు విశిష్టంగా కలిసిపొయ్యాయి ఆమెలో. ఒక్క శకుంతల తప్పితే, ఆమె అద్వితీయ. ఆ శకుంతలను మాత్రం ఎంతో కాలం పోల్చలేము సీతతో. వియోగం కలిగించినవి ఇద్దరివీ భిన్నపరిస్థితులు. కారణాలేవైనా ఫలితాంశాలుమాత్రం ఇద్దరివీ దాదాపు ఒక్కటే. వియోగంలో యిద్దరూ చాలాకాలం తప్తలే. కాని, సీతవియోగం దీర్ఘతరం. సీతకూ, శకుంతలకూ వున్న సామ్యం యీ ఒక్కవిషయంలోనే. తక్కిన వాటిల్లో ఎవరి దారి వారిదే. శకుంతలది ఊహాప్రపంచం. సీతలోకం వాస్తవికం. ఆమె లాగు లోకంపోకడ ఎరుగని ముగ్ధరాలు కాదు సీత; అనుభవశాలి, ఆర్ద్రహృదయ. సుఖదుఃఖాలు చవిచూచి, వెగటువేసింది. స్వామి యెందుకు త్యజించాడో బోధపడదు శకుంతలకు. తన కష్టాలు ఆమూలాగ్రంగా అర్థం

చేసుకుంది సీత. నిజం తెలియక, శకుంతల భర్తను నానామాటలూ అంటుంది. అడకత్తెరలోలాగు అటు ధర్మం, ఇటు ప్రేమ—వీటిమధ్య చిక్కి రాముడు పడ్డ పాట్లు చూచి సీత జాలిపడుతుంది. వియోగం కలిగినప్పుడు యిద్దరూ గర్భిణులే. కాని, ఆవియోగంలో సీతదుఃఖమే మరీ దుర్భరం. దెబ్బతిన్న శకుంతలహృదయానికి భరతుడైనా వున్నాడు. సీత అభాగ్యంకూడా నోచుకోలేదుగా, పాపం!

ఉత్తరరామచరితలో చెప్పుకోదగ్గ కథ యేమో లేదుగాని, మరిచిపోలేని సీత మాత్రం వుంది—యింకేం?




ఆంధ్రుల మానసికోత్సవములు—౧. పరసేవాజయంతి

# కవి : రవి

[గతసంచిక తరువాయి]

## సూర్యుని ఆత్మకథ

= కవికోకిల శ్రీ దువ్వూరి రామిరెడ్డి =

జనకజనయిత్రి భావముల్ సమత గలసి-యర్ధనారీశ్వరం బైన యాదిశక్తి
ప్రకృతి పురుషసమ్మేళన భవ్యమూర్తి-విశ్వజనని వర్ధిల్లు దుర్వీక్ష్యకాంతి.

ఆమహామాత యగ్నిగోళాండములను-పెట్టె, నం దొక్కటొకటియు బ్రిదిలి భాను
బింబములు పుట్టి యాకాశవీథి కెగసె;-అనుజు లందరలో నేన యల్పతనుడ.

అన్నల నొక్కడొక్కడు మహాద్భుతశక్తి సమున్నతాత్ములై
మిన్నున సర్వసంపదల మీరుచు రాజ్యము లేల, నీవు ఈ
లెన్నన బొల్లుగింజ వయి దేనికి నెక్కకయుండ గాంచి నా
కన్నులు కాయగాచె గొడుకా యని తల్లి సడించు మాటికిన్.

అది యటు లుండ, నాయొడలియందు వికారపు నల్లమచ్చలుం
బొదలిన జూచి "యమ్మకడుపుం జెడబుట్టినవాడ" వంచు న
న్నదవదపెట్టి కాలొడిసి యంతనె గిర్రని త్రిప్పిత్రిప్పియుం
జదలున బైకిబో విసరె జండసమీరము రేగి చుట్టగన్.

ఆదుర్వారమహోగ్రదిక్ప్రళయవాతాలోల కాదంబినీ
ప్రాదుర్భూత తమఃపరంపర దిశాభాగంబులం గప్పె; ను
ల్కాదండంబులు బాణవేగమున రాలం జొచ్చె; నక్షత్ర ధూ
ళీ దిగ్భ్రాంతి చెలంగె; నింగి రొదగొల్పెం గ్రిందుమీదైనటుల్.

మననాతీత మనోజవంబున నభోమార్గంబునం బోవుచో
మును నం దాకిన తారకల్ పగిలి దుమ్మం ధూళిగా రేగి నా
వెనువెంటం బరతెంచ, జాడవడియెన్ విన్వీది స్వర్గంగ మ
త్తనుసంతాపము వాప శీతజలపాతంబై సమీపించెనన్.

అప్పటి నామనోనుభవ మద్భుత మేమని చెప్పవచ్చు! నే
నప్పర మేగునప్పుడు నుడూత్కర మొయ్యన గ్రిందజారున

ట్లొప్పెను ; బోవబోవ బయి నోరల గ్రింద నమేయగోళముల్
గప్పిన యంతరాళము వికస్వరమై కనువిం దొనర్చెదుల్.

వారణము వారిమగ్న కుంభస్థలంబు-నెత్త, వలయంబు క్రమవృద్ధి నొత్తినట్టుల
బైకి జనుచుండ, మిన్నులు వడ్డచోటి-పరిధి, వామనరూపంబుపగిది నెదిగె.

పుష్కలావర్తకంబులు పొదలినట్లు-తారకాధూళి మొత్తమై తనర, నందు
సుడితుపానులు లోలోన సుడిసి రేగి-ప్రథిత నటరాజ తాండవ భ్రాంతి గొలుపు.

తేలెడు తెట్టెలా పగడదీవు లనన్ మెలమెల్ల దారకా
జాలము లేడకో చనెడు జాడ గనంబడు; దోకచుక్క లు
ద్వేలరయంబునన్ గగనవీథి గ్రమించి నటన్మయూరపిం
ఛాలయ పుచ్ఛవిభ్రమము లన్నిదెసల్ ప్రసరింపజేసెడిన్.

తెలుపు పసుపును నెరుపు లేమొలక నీలి-రంగులం బొల్చు తాపలు నింగి ప్రేల,
మాపు, బహువర్ణ విద్యుత్ప్రదీపికలను-అందగిలు పెండ్లిపందిరి యనగ దోచు.

ప్రళయవాత నిరంతరావర్తమందు-దోకచుక్క దగుల్కొని తొలగలేక
తిరిగె నన దారకారాశి దిరుగుచుండె-నుల్కలం గురిపించుచు నుప్పరమున.

పంక నిర్మగ్నమయి లేవ వలనుపడక-ధూమ్రబృహదశ్వ మొక్కటి దోచె మింట;
దాని దప్పింప తుణమైన దడవులేక-యతుల జవమున బైపైకి నరుగుచుంటి.

నిలువక కొంతకాల మటు నే బయి కేగుచు నుంటిగాని యు
జ్జ్వలదుడుఖండమండలనిబంధమునం బడి చిక్కుకొంటి; ఆ
స్థలము పరిక్రమింప బలదర్పము చాలమి గొంతకాల మా
కులపడి దారిచేయుటకు గుమ్మరిసా రెగతిన్ భ్రమించితిన్.

పరిసరధూళి మేఘములు పాయులుగా బరికీర్ణమూమ లో
బిరివిడి మత్తసుభ్రమణ వృత్తమునం బడి భీమణాగ్నికిం
గరగి మదీయదేహమును గ్రచ్చుకొనంగ, దదాది రాశి దు
ర్భరమయి యున్నలట్లు బలవంతుడనై యభివృద్ధి నొందితిన్.

ఇట్టు లుండగ నాకన్న నెన్నిరెట్లొ-ఘనతరం బగు తార నాకడకు రాగ
మించు భయమున మేను కుంచించి యొదిగి-గతుకులో బడ్డ బండినా గదలిపోతి.

బూదబూదగా లోదలోదగా-కదలెదు నాదేహమందు కణితలు పుట్టెఁ;
ముదిరి యవి పెద్దవాయెను;-కుదుటును మెయి తూకువాసి గునుకుచు నుంటిఁ.

భ్రమణ విస్తారవేగ దుర్వారహతికి-కణిత లెల్ల వృంతచ్యుతి గాంచి చెదరి
బహుళదూరంబునం బడి భ్రమయుచుండె;-అక్షమును జక్రమటు నన్ను నాశ్రయించి.

అందు నొక్కటి మీపృథ్వి యో గుమార;-కాని, దానికి నొక పెద్ద కణిత పుట్టె;
అదియు గాలక్రమంబున ముదిరి, వీడి,-సోమబింబంబునా భువిచుట్టు దిరుగు.

ఇవి మెల్లఁ వచియింప గొన్ని నిమిషాలె యైన, నెన్నెన్నొ కో
ట్లవు వర్షంబులు చెల్లె దద్విషయముల్ సాంతంబుగా సృష్టికాఁ;
కవి, నీభావవిహారఖేలనము విఖ్యాతంబుగా సాగ క్రొ
త్తవి విశ్వాద్భుత దృశ్యమార్గములు మోదస్ఫూర్తి సూచించితిఁ.

మాటాడ దలచియును నా-నోటను దడి లేక యడ్డునుడివిన నేమో
లోటగు ననుకొని వెరగుం-బాటున రవిజీవితంబు బాయక వింటిఁ.

విని యిటు లంటి : నో ప్రభువ, విస్మయచిత్తుడ నైతి మీచరి
త్రను విని ; విశ్వదర్శనము తన్మయతం గలిగించి నామనం
బున నవవిజ్ఞతాంకురము మోసిడజేసెను; మూఢభక్తివ
ర్తిని త్రుటిమాత్ర సత్యపరిధిఁ నిలబెట్టితి నయ్య భాస్కరా.

ఐనను సంశయములు నా-మానసమున నంకురించె; మనవి యొనర్తుఁ;
భానుం డొకడే యని యా-మానితుండుఁ మీరె యని భ్రమం గొనియుంటిఁ.

మీమాటలు విన్నంతట-వ్యామోహము కొంత దొలగె, నైననుగాని
వ్యోమము గాలించిన ది-క్సీమల బరసూర్యు డెవడు చిక్కడు దృష్టిఁ.

నీదు సందేహమున గొంత నిజము గలదు;-ఈప్రపంచమునకు నేన యినుడ నాదు;
తక్క భాస్కరు లూహింప దరముగాని-దూరమున నుంట జుక్కలై తోచుచుంద్రు.

వారిచుట్టును గ్రహములు భ్రమయుచున్నె?-వారలకు నిట్టి ధరణులు ప్రజలు గలరె?
అంద రర్కుల గుత్తిలో నణచుకొన్న-విశ్వకర్పర మది యెంతవిస్తృతంబొ!

చాల సూర్యు లేకాకులై సంచరింత్రు;-కొందరను జుట్టి గ్రహము లందందు దిరుగు;
ఉన్న ననుకూలసిద్ధమై యొప్పుకతన-బ్రస్తుతము ధాత్రి గొనసాగు బ్రాణిసృష్టి.

వసుధ నంతట నెందరు ప్రజలు గలరో-అన్ని తారక లొప్పారు నాకసమున ;
ప్రాత తారలు చల్లారి భస్మమైన-క్రొత్త తారలు పుట్టు నేకోణమందొ.

విశ్వవైశాల్య మింతని విశదపరుప-వలనుపడబోదు నావంటివానికైన ;
నిఖల సౌరకుటుంబముల్ నియతి లేక-చిదర జల్లిన విధమున గుదిరియుండు.

అరయ, నిరువదిలక్షల యంతరీప-విశ్వములు గ్రాలు బ్రహ్మాండ విపులకుక్షి ;
నందు నొక దీవి నారాజ్యమా గుమార, -యితర దీవుల కిట్టులే యినులు గలరు.

*మనకు దగ్గరగా నున్న యినుని రశ్మి-ధరణి జేరంగ నైదేండ్లు జరుగవలయు ;
దూరతములైన సూర్యుల దొరగు కాంతి-ప్రాకు బదునాల్గుకోట్ల వర్షముల నిలకు.

ఎనిమిది నిమిషంబులలో-నసయము మత్కాంతి భూమి కరుగుచునుండుః ;
గనుగొనుమ పోల్చి యెంతటి-ఘనవిస్తృతి గలదొ విశ్వకర్పరమునకుః.

ధరణికన్న నే దశలక్షల తరము లెచ్చు;-మరియు నాకంటె దశలక్షతరము లెచ్చు
గలుగు నన్నన్నొ తారలు గలవు చదల;-అన గొనయు లేని యీసృష్టి కంతు లేదు.

ఇది యెట్లు సంభవించును?-మొదలుం దుది లేని దొకటి యెునయునె? శంకా
స్పదమగు నీమాటలు; న-య్యది యెటు లూహింపవచ్చు నన, రవి యనియెః.

తారల్ పుట్టును, చచ్చి భస్మమగు; దద్భస్మంబె వేరొక్క- యా
కారంబుం గొని నూత్నజీవనముతో గంపించు; గల్లోలినీ
పూరం బింకియు బాష్పమై జలదమై పూరించు వర్షంబు; నీ
దారిన్ విశ్వ మనంతరజ్జువటు నిత్యంబై భ్రమించుంగదా.

స్థితియు రూపంబు మారును కేటు లేదు-అసలు వస్తువునకు నెప్వ డరయుమోయి;
మంటిగోడ వాన గరంగి మన్నుగాగ-అదియె పరగృహనిర్మాణ మందు నొదవు.

సృష్టిలేని క్షణంబు నూహింపలేము;-విలయ ముండని త్రుటిని భావింపలేము;
ప్రతినిమేషము భిన్నాంబుపూర మగుచు-బారు జీవనది యగు విశ్వంబు సఖుడ.

భానుకుటుంబములకు నా-భానుల కటు తప్పకుండ ప్రళయము గల్గుః;
గాని, యిటు విశ్వమంతకు-నేనాడును లేదు విలయ; మిది సత్యంబౌ.

* కాంతి ఒక సెకండునకు ౧౮౬౦౦౦ మైళ్లదూరము ప్రసరించును.

అన విని గర్వలేశము హృదంతరమందు జరింప, లోన నే
ననుకొనుచుంటి : సూర్యుని నియంతృత రాజ్యము విశ్వవీథిలో
అణురజమంత యౌ ననుచు; నంత వసుంధర జ్ఞప్తిరాగ సి
గ్గున దల వంచి నాతలపు గూఢముగా సవరించి పల్కితిన్.

ఇంతటి సత్యప్రియులను-ఇంతటి నిర్గర్వమతుల నెందును గన, మీ
స్వాంతంబున గాంతాళము-చింతాకంతయును లేక చెప్పితి రిటులన్.

నాకన్నన్ మహనీయులైన రవు లున్నా రన్న మీమాటకున్
నాకుం జోద్యము గల్గె; నన్యరవి యౌన్నత్యంబు నిష్కైతవ
ప్రాకామ్యంబున వర్ణనల్ సలుపు స్వార్థత్యాగసంపత్తి మీ
ధీకారుణ్యము గౌరవంబు దెలుపుం దెల్లంబుగన్ భాస్కరా.

పలుమరు నీరజాతహితుం బ్రస్తుతియించి, యనంతరంబు మీ
వలన ననంతవిశ్వపరిపాలనగుప్తసమస్త ధర్మముల్
తెలిసి దొలంగ వింటి బహువిజ్ఞత చేకురె; నైనగాని మా
యిల మిము వీడి యవ్వల నెటెట్టుల నుండెనో చెప్ప వేడెదన్.

తమకు ముద్దుల కూతురు ధరణిదేవి-చిన్నదయ్యును వయసులో జిన్నదయ్యు
బ్రాణికోటుల భరియించు భవ్యవృత్తి-మహితయౌచు జెలంగు మామాతృభూమి.

అని నే విన్నప మాచరింప విని నెయ్యంబార సూర్యుండు నీ
ఘనవిజ్ఞాన తృషాపనోదముగ వక్కాణింతు భూదేవి గాం
చిన మార్పుల్ పరిణామసంచరణ నిశ్శ్రేణీవిశేషంబులన్
వినవోయీ కవితాతపస్వి, యని గావించెం గథారంభమున్. [సశేషము]

---

# రాజరాజనరేంద్రుని

# మండతామ్రశాసనము

= శ్రీ డా. నేలటూరి వెంకటరమణయ్య =

శాసనలబ్ధి:—తూర్పుగోదావరిజిల్లా ఆలమూరు పోస్టాఫీసునకు సంబంధించిన గుమ్మిలేరువాస్తవ్యులగు శ్రీ యండ్ర వీర్రాజుగారి మూలమున ఈశాసనము ప్రచురణార్థము శ్రీ భారతీపత్రికాధిపతుల కడకు పంపబడెను. పరిష్కరణార్థము వారిద్వారా నాయొద్దికి వచ్చినది. రామచంద్రాపురంతాలూకాలోని మండపేటగ్రామమున ఇండ్లపునాదులు త్రవ్వుచుండగా మూడు గజములలోతున గానవచ్చిన మట్టికుండయం దీశాసనము దొరకెనట.

స్వరూపాదికము:—వరాహముద్రతో గూడిన రాగికడియమునకు గూర్చబడిన మూడు రాగిరేకులపై నీశాసనము చెక్కబడియున్నది. ఇం దొక్కొక్క రేకుయొక్క నిడివి అం. ౯, వెడలుపు అం. ౩.౧. రేకుల కన్నిటికిని అంచులు కట్టియున్నవి. మొదటిరేకు మొదటిప్రక్క వ్రాత లేదు. మొదటిరేకు రెండవ ప్రక్క ౧౫ పంక్తులును, రెండవరేకున కిరుప్రక్కలను, మూడవరేకు మొదటిప్రక్కను నొక్కొకప్రక్కకు పదహారేసిపంక్తులును, మూడవరేకు రెండవప్రక్క ౬ పంక్తులును మొత్తముమీద శాసనమం దంతటను ౭౮ పంక్తుల వ్రాత గలదు. కడియముయొక్క మందము అం. .౩౫, నడిమికొలత అం. ౮. భారతీకార్యస్థానమునకు వచ్చునప్పటికు కడియము వలకునుండలేదు. నా కొరకమీదనే యది ఛేదింపబడినది. కడియముతోగూడ రేకుల తూకము అయిదున్నర సేరులు, లేక సుమారు ౨౧౫ తులములు.

ముద్రిక:—ఈశాసనవలయముతో రాజముద్రిక తాపటము సేయబడియున్నది. ఇది కలిదిండిశాసనపు ముద్రికకంటె చిన్నది; అంత చక్కనిదికూడ కాదు. దీని నడిమికొలత అం. ౨.౬. అంచుల మందము అం. .౩. ముద్రికకు రెండుతలముల నంచులు గట్టబడియున్నవి. క్రిందిపైపు అం. .౬ యెత్తును, అం. ౮.౮ చుట్టుకొలత గల బొద్దును దీర్చి దాని యడుగున నాలుగు పైపులను నాలుగు పెద్దదళములును, మూలలందు దళలేశములును గల పుష్పరూపముగ జేసి దాని యధోతలమున నొక రేకు నంటించి యారేకును కడియము కొనలు గలియు తావు మరుగుపడునట్లు చుట్టి దాని నిటునటు గదలనీయక గడియమున కతికించి భద్రముగ తాపటము జేసియున్నది. ముద్రికయుపరితలము దర్పణాకృతమున గానవచ్చెడు 'శ్రీ త్రిభువనాంకుశ' యను పొతయక్షరముల పంక్తివల్ల రెండుభాగములుగ విభజింపబడుచున్నది. ఈపంక్తికి పైభాగమున మధ్యప్రదేశమున నెడమముఖమై పరుగిడుచుండునట్లు గానవచ్చు వరాహబింబమును, దాని ముఖమున నెదుట శంఖమును, బుచ్ఛమునకు వెనుక డమరుని గానవచ్చుచున్నవి. ఈవరాహబింబముయొక్క వీపున కగువ సూర్యచంద్రఛత్రచిహ్నములు దెలియవచ్చెడివి. పై యక్షరపంక్తికి గ్రిందిభాగమున నెడమకొనయడుగున నధోముఖముగ నడ్డముగ బండవేసిన యంకుశమును, దానికి దిగువ నెడమపైపునుండి వరుసగ నొక చిరుగద్దెయు, చతుర్దళములతోడను, పన్నియ యుపదళములతోడను గూడిన వికసితపుష్ప మొక్కటియు, కామతోడి మొగ్గ యొక్కటియు గానవచ్చుచున్నవి.

శాసనస్థితి:— శాసనము చక్కని స్థితియందున్నది. చిరకాలము భూస్థాపిత మైయుండిన కారణమున పెక్కుతావుల చిలుము దట్టముగ నావరించుకొనియుండినను, శాసన మెచ్చటను జెడిపోలేదు. లోతుగ చెక్కబడియుండుటచే నక్షరములు

మాసిపోక స్పష్టముగ నగపడుచున్నవి. కాని శాసన గ్రంథమున దప్పు లనేకములు గలవు. దీనికి ముఖ్యకారణము లేఖకుని యజాగ్రత్తయే. శాసనము చెక్కునప్పుడు పెక్కు స్థలములయందు మాటలను దిగవిడచినాడు. చూ: పంక్తులు—4. 'చక్రవర్తీ సవిక్రమః' అనుటకుబదులు 'సవిక్రమః'ను దిగమ్రింగి 'చక్రవర్తీ' యనియే యనియనుష్టుభును వదలివేసియున్నాడు. 11, 'సింహాసనా' యనుటకు 'సింహానా' యనియు, 12. 'చక్రవర్తిషుగతేషు' అనుటకు బదులు 'చక్రవర్తిషుషు' అనియు వ్రాయబడియున్నది. ఇట్టి పెక్కు గుణింతపు తప్పుల మాట ప్రత్యేకించి చెప్పవలసినదిలేదు.

అక్షరస్వరూపము:—అక్షరస్వరూపమునుగూర్చి తెలుపదగిన విశేషాంశము లెవ్వియు లేవు. క్రీ. శ. ౧౧-వ శతాబ్దపూర్వార్ధమున బుట్టిన దానశాసనముల లోని యక్షరముల వంటివే ఇందలి యక్షరములును. అక్షరముల పోలికలనుబట్టి కలిదిండి నందంపూండిశాసనములు దీనికి సన్నిహితము లనదగియున్నవి. వర్ణస్వరూపమిట్లు సామాన్యమే యైనను, నప్పటి పూర్వచాళుక్య శాసనములలో సాధారణముగ గానరాని వర్ణము లిందు రెండు పొడకట్టుచున్నవి. అం దొకటి 'ఊ' కారము. ఇప్పటి 'ఊ' కారము నిది కొంత పోలియున్నను, రూపమున గొంత భేదము దెలియవచ్చుచున్నది. దాపలి వంపు గల కొడవలివంటి యూకారము దీనిది. నెత్తిపై సిడి యుండు తావున సూక్ష్మతమమైన యూర్ధ్వరేఖ యొక్కటి గలదు; పొక్కిలి లేదు; దీర్ఘమును సూచించుటకై రెండు భుజముల మధ్య తలను మీదికిని, తోకను గ్రిందికిని ద్రిప్పి నిలువుగ వ్రాయబడిన తొమ్మిదర సంఖ్యనుబోలిన చిహ్నమొకటి గానవచ్చుచున్నది (చూ: రే ౩, ప్ర ౧, పం. ౧౪). రెండవది 'ఓ' కారము. దీనికిని, ఇప్పటి 'ఓ'కారమునకును గల భేద మత్యల్పము. తల యించుక పెద్దది; పొక్కిలి లేదు (చూ: రే ౩, ప్ర ౨, పం ౨.).

గుణింతము:—హల్సంయుక్త 'ఎ' కార 'ఒ' కారముల హ్రస్వదీర్ఘభేదమును సూచించుటకు ప్రాచీన శాసనములందువలె నిందును ప్రత్యేకచిహ్న మేమియు గానరాదు. సందర్భానుసారముగ వాచకులే భేదమును నిర్ణయించుకొనవలసియున్నది. కాని ఇ- కారము యొక్క హ్రస్వదీర్ఘభేదమును సూచించుటకుమాత్రము ప్రత్యేక చిహ్నములు వాడబడినవి. హల్సంయుక్త హ్రస్వ 'ఇ' కార మిప్పటివలెనే యక్షరముమీద వ్రాయబడిన గుడిమూలమున సూచింపబడినది; కాని ఇది దీర్ఘమైనప్పుడు ఇప్పుడు వాడుకయందుండు గుడిమీది పొల్లునకు మారుగ గుడిలోనికి జుట్టబడిన గీతమూలమున దెల్పబడినది. ఈభేదము క్రీ. శ. ౧౦, ౧౧ శతాబ్దములనాటి తామ్రశాసనములయందు సామాన్యముగ గానవచ్చుచున్నది. అనునాసికకుబదులు సాధారణముగ ననుస్వారమే గానవచ్చుచున్నను గాదాచిత్కముగ ప్రాచీనపద్ధతిననుసరించి వర్గసంబంధియగు నాసిక వాడబడియున్నది (చూ: ౨. ౨. ౪౧ అత్రాస్తరే). మఱియు రేఫ యుక్తమగు హల్లు ద్విత్వమును బొందుచున్నది (కర్త్తా, సార్వ్వభౌమ, నిర్వ్విశేష, కర్మ్మాణి, తత్సూనుర్మ్మంగి యువరాజః, విష్ణువర్ద్ధన, ధర్మ్మ ఇత్యాది)ఇది ప్రాచీన పద్ధతి.

భాష:—ఇందలి భాష సంస్కృతము. గద్య పద్యాత్మకము. దానవర్ణన సందర్భమున వాడబడిన భాష సంస్కృతమనుటకంటె తెనుగని చెప్పుటయే యుచితము. మొదటిమాట సంస్కృతము, తక్కిన భాగమంతయు తెనుగును గల వాక్యములు గొన్ని కలవు. ఉ. "దక్షిణమునకూఱిమధ్యమున గుంటయుసీమా" "పూర్వతః వల్లూరి పొలగరుససీమా." ఇదికాక ఒక సంపూర్ణ తెనుగువాక్యము గూడ గానవచ్చుచున్నది. "ఊరి తూర్పునుండి పడుమటికిం బాఱిన పెద్దవీధి దక్షిణమున గృహక్షేత్రమున పూర్ణ నలువది". (పం. ౬౫-౬౬).

శాసనగ్రంథము:—ప్రస్తుతము పరిష్కృతమగుచున్న ఈ శాసనము నందంపూండి శాసనమునకు సంగ్రహీకరణ మని చెప్పవలసియున్నది. నందంపూండి శాసనములోని శ్లోకముల ననవసరములైనవానిని దిగవిడిచి వంశాదికము సంక్షిప్తముగ వర్ణింపబడినది. పౌరాణిక వంశానుక్రమణికలో గొన్ని పేర్లీకారణమున వదలివేయబడినవి. ఈ విషయమును ప్రకరణాంతరమున నిరూపించుచున్నాను.

శాసన గ్రంథమును నాలుగు భాగములుగ విభజింపవచ్చును. (౧) పౌరాణికవంశానుక్రమణిక [పం. ౧-౨౨] (౨) చారిత్రకవంశానుక్రమణిక: మొదటిపులకేశి మొదలు విమలాదిత్యునివఱకు [పం. ౨౩-౪౩]. ఈ రెండు భాగములయందును విశేషించి చెప్పదగిన యంశమేదియు లేదు. ఇంతకుపూర్వము ప్రకటితములైన రాజరాజనరేంద్రుని తామ్రశాసనములలో గానవచ్చు విషయములే ఇందును చెప్పబడినవి. (౩) రాజరాజనరేంద్రుని వృత్తాంతము. ఇతర శాసనములలో నున్నట్లే యితడు విమలాదిత్యకుందవలపుత్రుడని, శకవత్సరములు వేదాంబురాశినిధులు (౯౪౪) వర్తించుచుండ సూర్యుడు సింహగుడై యుండ బహుళపక్షద్వితీయగురువారమునాడు ఉత్తరాభాద్రానక్షత్రయుక్త వణిజలగ్నమున నతడు రాజ్యాభిషిక్తుడాయెననియు గలదు [పం. ౪౪-౫౨]. ఇవియు చిరపరిచితములే. వీనిగూర్చిన చర్చ యనవసరము. (౪) దానప్రస్తావన, ప్రతిగృహీతవంశాదికవర్ణన, దాన వివరణ ఇత్యాది. [పం. ౫౨-౬౯]

శ్రీ సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజాధిరాజ పరమేశ్వరాది బిరుదాంకితుడైన రాజరాజదేవుడు గుద్దవాడివిషయములో మండగ్రామవాస్తవ్యులగు రాష్ట్రకూట ప్రముఖకుటుంబులను పిలిపించి, ఆపస్తంబసూత్రుడును, భారద్వాజ గోత్రుడును, శివకుమారభట్టుని పౌత్రుడును, రామదేవుని పుత్రుడును, సమస్తభువనాశ్రయ బ్రహ్మమహారాజని ప్రసిద్ధివండిన అంకలు యనునతనికి మండయను గ్రామమున దక్షిణదిక్కున ముప్పడి భీమకోలగొలిచి ముప్పదిపుట్ల వడ్లపట్టు వరిక్షేత్రమును, నుత్తరదిక్కున ముమ్మడిభీమకోల గొలిచి పదిపుట్ల వడ్లపట్టు జొన్న క్షేత్రమును, నొక్కపుట్టియుం బందుము వడ్ల పట్టు తోంటపడకు క్షేత్రమును బన్నసగావించి ధారాపూర్వకముగా సూర్యగ్రహణనిమిత్తమున నిచ్చితి నని తెలిపెను. ఇట్లు దానము సేయబడిన క్షేత్రముల మేరలు:-దక్షిణక్షేత్రమునకు-తూర్పు వల్లాకుపాలగరుసు; దక్షిణము ఊరినడిమిగుంట; పశ్చిమము కొఅప్పుట్టతోడిగుంట; ఉత్తరము పెనుమాల అలమ. ఉత్తరక్షేత్రమునకు- తూర్పు చింతతోడిపుట్ట, దక్షిణము సప్తగోదావరి; పశ్చిమము భీమయరట్టడి త్రోవ్వడ్డి; ఉత్తరము గుంట. ఈ క్షేత్రములపై యచ్చవలసిన పన్నులన్నియు- యాచనము మాడ యొక్కటి తప్ప - పరిహరింపబడెను. పైచెప్పిన క్షేత్రముగాక ఊరితూర్పున నుండి పడుమటికి బాతిన పెద్దవీథి దక్షిణమున గృహక్షేత్రమున నలువది పూడ్ల గూడ దానము సేయబడెను.

ఈశాసనగ్రంథమువల్ల దెలియవచ్చు నూతన చరిత్రాంశములు లేవు. పేర్కొనబడిన విషయము లన్నియు సుపరిచితములే. కావున వానినిగూర్చి ప్రత్యేక ప్రస్తావన కవసరము గాన్పించదు. ఇట్లు చర్చించదగిన విశేష చరిత్రాంశములు గానరాకపోయినను విచారించవలసిన విషయ మొక్కటి గలదు. అది ప్రతిగృహీతయగు వంకయయొక్క బిరుదు. ఇతడు సమస్తభువనాశ్రయ బ్రహ్మమహారాజని ప్రసిద్ధుడట. ఈబిరుదును 'సమస్తభువనాశ్రయ' 'బ్రహ్మమహారాజ' అని రెండుగ విడదీయవచ్చును. బ్రహ్మమహారా జనునది యొక పదవిని దెలిపెడి మాట. క్రీ. శ. ౧౧౩౫ నాటి యొకానొక ముఖలింగశాసనమున వైశ్యమారాయండొకడు గాన్పించుచుండుటచేత (SII.V.1100) నాకాలమున బ్రహ్మవైశ్యవర్గముల కొక్కొక దానికిని మహారాజ బిరుదాంకితుడైన యొక యధికారి యుండువాడేమో నను సందేహము కలుగుచున్నది. ఈపదవి చోళదేశమున మొదట ప్రచారమున నుండి చోళుల ప్రాబల్యముతో గూడ ప్రఖ్యాతివడసి దక్షిణదేశములం దంతటను వాడుకకువచ్చెను. బ్రహ్మవైశ్యమహారాయ లీరాజానాశ్రయించి యాతని ప్రసాదమున నధికారమునకు వచ్చిరో యతని పేరును దమ పదవీసూచక నామమునకు ముందుచేర్చుకొనువారు. ఉదా: రాజరాజ బ్రహ్మమహారాజ ఇత్యాది. ఇక 'సమస్తభువనాశ్రయ' శబ్దమును విచారింతము.

పైచెప్పినదానినిబట్టి సమస్తభువనాశ్రయ శబ్దమొక ప్రభువు పేరు గావలసియున్నది. సమస్తభువనాశ్రయనృపుని పేరే బ్రహ్మమహారాజ శబ్దమునకు ముందు గానవచ్చుచుంటచే వంకయ యతనికాలమున నుండెనని, చెప్పవలసియున్నది. ఈసమస్తభువనాశ్రయు డెవ్వడు? సమస్తభువనాశ్రయశబ్ద మొకవ్యక్తిని సూచిం

చను. అది వట్టి బిరుదు. ఇది చాళుక్యరాజవంశమున ప్రాచీనకాలమునుండియు వ్యవహారమున నుండెను. క్రీ.శ. ౬౯౬ మొదలు ౭౩౩ పర్యంతమును రాజ్యముపల్పిన బాదామి చాళుక్యరాజగు విజయాదిత్యుని కీబిరుదుండెనని యాతని రాయగడ తామ్రశాసనమువల్ల దెలియుచున్నది.[1] మఱియు క్రీ.శ. ౯౪౫ నుండి ౯౭౦ వఱకు వేంగిదేశము నేలిన ఇమ్మడియమ్మరాజవిజయాదిత్యు డను పూర్వచాళుక్యరాజునకుండినట్లు అతని పాములవాక తామ్రశాసనమువల్ల తెలియుచున్నది[2]. కాని ఇది బాదామిచాళుక్యులకు గాని, వేంగిపూర్వచాళుక్యులకుగాని కులక్రమాగతమైన బిరుదు గాదు. సుప్రసిద్ధములనియు దలచుటకు వీలులేదు. బాదామిచాళుక్యవిజయాదిత్యుని కీబిరు దుండినట్లాతని శాసనములలో నొకదానియందుమాత్రము చెప్పియున్నది. ఇట్లే పాములవాక శాసనమున దప్ప నమ్మరాజవిజయాదిత్యున కీబిరు దుండినట్లు మఱియొందును లేదు. కావున పైజేర్కొన్న రాజులీ బిరుదును వహించుట కేవలము గాకతాళీయ మని చెప్పవలసియున్నది. కాదాచిత్కముగ నిట్లు బాదామి వేంగిచోళరాజులచే వహింపబడిన ఈబిరుదును కల్యాణి చాళుక్యరాజులు కులక్రమాగతమైనదానిగ జేసికొని సుప్రసిద్ధము జేసిరి. వారి శిలాశాసనము లన్నియు 'స్వస్తిశ్రీ సమస్తభువనాశ్రయ' యనియే యారంభమగుచున్నవి. తామ్రశాసనములలోను దీని ప్రాముఖ్యము గానవచ్చుచున్నది. కేవలము కల్యాణిచాళుక్యులదిగ బరిగణింపబడుచుండిన నీబిరుదు వేంగివాస్తవ్యుడైన బ్రాహ్మణుని కెట్లు సంక్రమించినది? రాజరాజనరేంద్రుని మూలమున నని చెప్పవలసియున్నది. రాజరాజునకు సమస్తభువనాశ్రయుడను బిరు దున్నట్లు నన్నయభట్టు తన యాంధ్రమహాభారతమున నుడివియున్నాడు:

"త్రిభువనాంకుశదీప్తినిధీ సమ
స్తభువనాశ్రయధర్మధురంధరా
శుభయశః పరిశోభితపూర్వది
క్ప్రభువిలాసకృపారసబంధురా."
(ఆది. 3-౨౬౫)

1. Ep Ind.
2. JAHRS. II P. 247.

కావున సమస్తభువనాశ్రయ బిరుదాంకితు డగు రాజరాజనరేంద్రునిచే బ్రహ్మమహారాజ పదవియందు స్థాపితు డగుటచే బ్రతిగృహీతయగు నంకయకు సమస్తభువనాశ్రయ బ్రహ్మమహారా జను బిరుదనామము గల్గెనని నిశ్చయముగ జెప్పవచ్చును.

'సమస్తభువనాశ్రయ' బిరుదు రాజరాజనరేంద్రునికి వంశక్రమానుగతము గాదు. ఇతని తండ్రియైన విమలాదిత్యునికిగాని, పెదతండ్రియగు ప్రథమశక్తివర్మకుగాని, తాతయగు దానార్ణవునికిగాని ఈబిరుదు లేదు. రాజరాజనరేంద్రుని కిది యుండినట్లతని శాసనములందు జెప్పియుండలేదు. ప్రస్తుతము బరిష్కృత మగుచున్న ఈ శాసనమునందు గూడ దీనికి రాజరాజనరేంద్రుని బిరుదావళియందు తావు లేదు. ఇట్టి బిరు దతనికి గలదని యూహించిరేని కనుగొనవలసివచ్చినది. నన్నయభట్టు భారత మీయంశమును స్పష్టము సేయకుండిన నీసమస్తభువనాశ్రయ బ్రహ్మమహారా జెవ్వడో కల్యాణిచాళుక్యరాజుల యాశ్రితు డని చెప్పవలసియుండెడిది. కావున 'సమస్తభువనాశ్రయ' యనుబిరుదు రాజరాజనరేంద్రునికి సుప్రసిద్ధము కాదని తేలుచున్నది. మఱియొక మాట. ప్రస్తుత శాసనము రాజరాజనరేంద్రుని కడపటి దశయందు వ్రాయించినది. నన్నయభట్టు మహాభారతము నైతము రాజా అంత్యదశయందు విరచింపబడినదే. ఉన్నట్టుండి యాకస్మికముగ నతడు రాజపదచ్యుతు డైపోవుటచేతనే మహాభారతరచన కంతరాయము గల్గియాగిపోయినది. నన్నయ మహాభారతమునందే రాజరాజునకు సమస్తభువనాశ్రయ బిరు దున్నట్లు చెప్పియుండుటచే నేకారణమువల్లనో యతడు తన రాజ్యాంతకాలమున గల్యాణిచాళుక్యులకు గులక్రమాగతమైన ఈ బిరుదును స్వీకరించినట్లు తోచుచున్నది. కల్యాణిచాళుక్యరాజుల బిరుదావళిలోనుండి రాజరాజు తన చరమ దశయందు స్వీకరించిన దిది యొక్కటియే గాదు. 'సత్యాశ్రయకుల శేఖర' యనునది మఱియొకటి గలదు. రాజరాజు శిలాతామ్రశాసనములలో దీని పొడసూపుటను గానరాకున్నను నన్నయభట్టే దీని జేర్కొనియున్నాడు.

"సత్యాశ్రయకుల శేఖర
నిత్యోదయ రాజరాజనృపసుకవిజన
స్తుత్యమహాగుణ విమలా
దిత్యాగ్రతనూజ విమలధీరమణీయా".

(ఆది. ౩-౨౬౪)

ఈ 'సత్యాశ్రయకుల శేఖర' యనునది కల్యాణి చాళుక్యుల శాసనములందు సర్వత్ర కానవచ్చెడి 'సత్యాశ్రయకుల తిలకం' అనుదాని పాఠాంతరము. కల్యాణిచాళుక్యరాజులు దాము సత్యాశ్రయకులతిలకుల మని ప్రతి శాసనమందును ప్రకటించుకొనియున్నారు. బాదామి చాళుక్యరాజును మొదటి పులకేశివల్లభునికి సత్యాశ్రయుడని నామాంతరము కలదు. అతని వంశీకులగుటచే బూర్వచాళుక్యులను గూడ సత్యాశ్రయకుల శేఖరులని చెప్పకొనవచ్చును. అట్లు చెప్పకొన్నవారు పూర్వచాళుక్యరాజులలో నెవ్వరును లేరు. రాజరాజనరేంద్రుని కీబిరు దుండె ననుటకు సాక్ష్యము నన్నయభట్టొక్కడే. అన్యాధార మెద్దియు గానరాదు.

పైదర్పవల్ల దేలిన సారాంశ మేమనగా' కల్యాణిచాళుక్యులకు కులక్రమాగతము లగు సమస్త భువనాశ్రయ, సత్యాశ్రయకుల శేఖర యను బిరుదులను రెంటిని రాజరాజనరేంద్రుడు దన రాజ్యాంత్యదశయందు స్వీకరించెనని. దీనికి కారణము లేకపోలేదు. క్రీ. శ. ౧౦౪౨-వ సంవత్సరప్రాంతమున కల్యాణి చాళుక్యులు వేంగిరాజ్యమును జయించిరి; రాజరాజనరేంద్రు డప్పుడు కల్యాణకటకము నేలుచుండిన యాహవమల్ల త్రైలోక్యమల్ల సోమేశ్వరచక్రవర్తికి లొంగి యరిగాపు కావలసివచ్చెను. రాజరాజనరేంద్రుని మరదులలో నొకడగు వీరరాజేంద్రచోళదేవుడు తాను సింహాసనమ నధిష్ఠించకపూర్వము వేంగిలోని రాజకీయపరిస్థితులనుగూర్చి యిట్లు చెప్పియున్నాడు:

"భ్రాతృభ్యాం సముపేక్షితం జనపదం
వంశక్రమాభ్యాగతం
క్రాంతం వైరిమహీశ్వరై రతిబలై
ర్వేంగీంకళింగానపి,
జిత్వా శత్రుపరంపరా మతిబలాం
భిత్వా చ దుర్గాన్యహో
శ్రీమా న్వల్లభవల్లభక్షితిపతిః
క్షేమేణ తం సోన్వశాత్"1

అనగా నిజసోదరుల యుపేక్షవల్ల స్వవంశక్రమాభ్యాగతమైన వేంగీ-కళింగజనపదము బలవంతులగు శత్రువులచే నాక్రమించుకొనబడగా వల్లభవల్లభక్షితిపతి (వీరరాజేంద్రుడు) వారిని జయించి పెక్కుదుర్గములను భేదించి యాజనపదమును రక్షించె నని తెలియవచ్చుచున్నది. వేంగీ-కళింగజనపదము మొదటి శక్తివర్మకాలమునుండి చోళచక్రవర్తుల యధికారమునకు లోబడియుండిన రాజ్యమగుటచేత వీరరాజేంద్రుడు దానిని వంశక్రమాభ్యాగతమని చెప్పకొనెను. వీరరాజేంద్రునికి పూర్వ మతని యన్నలు రాజాధిరాజ యిమ్మడిరాజేంద్రచోళులు చోళసామ్రాజ్యమును క్రీ. శ. ౧౦౪౪ మొదలు ౧౦౬౪ వఱకు నొకరిపిమ్మట నొకరు పాలించిరి. క్రీ. శ. ౧౦౪౪ వఱకును వేంగి కళింగజనపదముపై చోళుల యధికారము సాగుచుండె నని శాసనములవల్ల దెలియుచున్నది. తరువాత నెంత కాలము నడచెనో చెప్పటకు సాధ్యముగాదు. చోళుల కడనుండి వేంగికళింగరాజ్యము నొడిచికొన్న ప్రబల శత్రువులు కల్యాణిచాళుక్యులని వీరరాజేంద్రుని శాసనములవల్ల దెల్లమగుచున్నది. కావున క్రీ. శ. ౧౦౪౪, ౧౦౬౪ ల మధ్య కల్యాణిచాళుక్యులు వేంగి కళింగలను జయించి స్వాధీనపఱచుకొనిరని నిశ్చయముగ జెప్పవచ్చును. వేంగికళింగలపై కల్యాణిచాళుక్యుల యధికారము సాగెనని వారి శాసనములయందే కొంత యాధారము కలదు. వరుసగ క్రీ. శ. ౧౦౪౯, ౧౦౫౩, ౧౦౫౪ లనాడు వేయించిన మూడు శిలాశాసనములలో ఆహవమల్లసోమేశ్వరుని జ్యేష్ఠపుత్రుడగు భువనైకమల్ల సోమేశ్వరుడు దాను వేంగీపురవరేశ్వరుడ నని చెప్పకొనియున్నాడు2. ఈ బిరు దీత డేల వహించెనో తెలియదు. కాని, చోళశాసనములలో నీకాలమున వేంగికళింగ జనపదము కల్యాణి చాళుక్యుల స్వాధీనమున నుండినట్లు చెప్పియుండుటచేత, భువనైక

1. Ep. Ind. XXV. P. 262

2. Bk. I. No. 90, EI. XVI, p. 54-5; Bk. I No. 84.

మల్ల సోమేశ్వరుడు వేంగివిజయమున బాల్గొని వేంగి పురమునకు పాలకు డగుటచే గల్గెనని యూహించుట కవకాశము గలదు. దీనికి బ్రోద్బలముగ క్రీ. శ. ౧౦౫౫-౬ నాటి కల్యాణీ చాళుక్య శాసన మొకటి ద్రాక్షారామమున గానవచ్చుచున్నది. 'శకవర్ష ౯౭౭ గు శ్లేంటు భీమేశ్వర దేవరకుం జక్రవర్తి త్రైలోక్యమల్ల దేవర ప్రధాని నారాయణభట్ల పుంటలు ఉపవాసెట్టిన అఖణ్డవర్తి లోహపుదివియ'[1] యను శాసనవాక్యమువల్ల నప్పుడు కల్యాణచాళుక్య చక్రవర్తి యగు మొదటి సోమేశ్వరుని ప్రధాని యొకడు వేంగియం దుండె నని తెలియవచ్చుచున్నది. ఇట్లు చోళకల్యాణ చాళుక్య శాసనముల సాక్ష్యమును జంటించి చూడగా క్రీ. శ. ౧౦౪౭ మొదలు ౧౦౬౬ పర్యంతము వేంగి కల్యాణీ చాళుక్యుల యధీనమున నుండెనని విదిత మగు చున్నది.

వేంగీదేశ మిట్లు కల్యాణ చాళుక్యుల యధీనమై యుండిన రాజరాజనరేంద్రు డెచట నుండెనో కనుగొనవలసియున్నది. అతని శాసనముల నన్నింటిని బరిశీలించి చూడగా నతడును వేంగియందే రాజ్యము సేయుచుండె నని తెలియుచున్నది. ఈ సందర్భమున పేర్కొన దగిన శాసనములు మూడు గలవు. మొదటిది నందంపూండి తామ్రశాసనము. ఇది రాజరాజ నరేంద్రుని ౩౨-వ రాజ్యవర్షమున నతడు సంస్కృత ప్రాకృత పైశాచిక కర్ణాటాంధ్ర భాషలయందు కవిత చెప్ప నేర్చిన నారాయణ భట్టునకు జేసిన భూదానమును దెల్పును.[2] రాజరాజనరేంద్రుడు క్రీ.శ. ౧౦౧౯-వ సంవత్సరమున రాజ్యము సేయ నారంభించె గావున నతని ౩౨-వ రాజ్యవర్షము క్రీ. శ. ౧౦౫౧ అగుచున్నది. రెండవది నందివెలుగు శిలాశాసనము. ఇది శక వర్షము ౯౭౦ కి సరిపోవు రాజరాజనరేంద్రుని ౩౮-వ రాజ్యవర్షమునాటిది. క్రీ. శకము ౧౦౫౮ కిది సరియగుచున్నది.[3] మూడవది కలిదిండి శిలాశాసనము. శక వర్షము ౯౭౩ వది (అనగా క్రీ. శ. ౧౦౫౧) సరియైన రాజరాజనరేంద్రుని ౪౧-వ రాజ్యవర్షమున జేసిన దానము నిది దెల్పును.[4] ఈ శాసనములవల్ల వేంగిదేశము కల్యాణిచాళుక్య సోమేశ్వర చక్రవర్తి యధికారము క్రింద నున్న కాలముననే యచట రాజరాజ నరేంద్రుడును రాజ్యము సేయుచుండె నని తెలియుచున్నది. ఏకకాలమున నీ యిద్దరు రాజులును వేంగియందు రాజ్యము సేయుట యెట్లు సాధ్యమైనదో కనుగొనవలయును. స్వతంత్రులై యొండొరులతో నిరంతరము పోరుచు దేశమునంతటిని స్వాధీన పరచుకొనజాలక యొక రొక భాగమునను, మఱియొక రింకొక భాగమునను దమతమ యధికారములను సాగించుకొనుచుండవలయును. లేదా ఒకరు మఱియొకరి యాధిక్యము నంగీకరించి యరిగాపై యేలుచుండవలయును. రాజరాజనరేంద్రు డీ కాలమున దన స్వతంత్రము నిలబెట్టుకొనుటకు సోమేశ్వరునితో గాని, యితరులతో గాని యుద్ధము సేయుచుండె ననుట కాధార మేదియు గానరాదు. లభించిన శాసనములను బట్టి చూడగా నతడు స్వస్థముగ శత్రుభయరహితముగ రాజ్యము సల్పుచున్నటు లున్నది. యుద్ధసూచన లెందును గానరావు. కావున రాజరాజనరేంద్రుడు స్వతంత్రప్రతిష్ఠుడై పోరుచుండె నని చెప్పుటకు వీలులేదు. ఇక వారియం దొకరికి మఱొకరు లొంగి యాశ్రితులై ప్రభుత్వము సేయుచుండిరని యూహించవలసి యున్నది. ఈయూహ సమంజసమగుచేని, రాజరాజనరేంద్రుడే సోమేశ్వరు నాశ్రయించి రాజ్యము సేయుచుండె నని చెప్పవలసివచ్చును. ఏలన సోమేశ్వరు డశేషసామ్రాజ్య సంపద గల చక్రవర్తి. హస్త్యశ్వపదాతి బలసంపన్నుడు. అంతటివాడు కర్ణాటాంధ్రమహారాష్ట్రాది దేశములపై నిర్వక్రపరాక్రముడై నిరంకుశముగ బ్రభుత్వము సల్పుచుండు కాలమున శత్రురాష్ట్రమగు వేంగికి వచ్చి రాజరాజనరేంద్రునికి సామంతు డగుట యసంభవము. నిరంతరము చోళుల సహాయమున రాజ్యము సేయుచుండిన రాజరాజనరేంద్రుడే, చోళుల బలము సన్నగిల్లగా

1. SII. IV 1010.

2. Ep. Ind. IV P 300 f, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక. సం. ౧. పుట ౪౫.

3. ARE 668 of 1920.

4. ARE 671 of 1920.

దేశముపై నెత్తివచ్చిన సోమేశ్వరు నెదిరించు శక్తిలేక యతనికి లొంగి సంధిగావించుకొనె నని తలచుట యుక్తము. ఈయభిప్రాయమును బలపఱచువిషయ మొక్కటి కలదు. త్రైలోక్యమల్లదేవుని ప్రధానియగు నారాయణభట్టు క్రీ. శ. ౧౦౫౫ ప్రాంతమున వేంగియం దుండెనని పూర్వప్రకరణమున జెప్పియున్నాము. ఈ ప్రధాని నారాయణభట్టే నందంపూడి శాసన ప్రతిగ్రహీతయు, భారతాంధ్రీకరణమున నన్నయకు సాహాయ్యుడును నగు నారాయణభట్టని కీ. శే. కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు పంతులుగారు నిరూపించియున్నారు. 1 ఇది సంగతమేని ప్రధాని నారాయణభట్టు నిజప్రభువగు త్రైలోక్యమల్లసోమేశ్వర చక్రవర్తియొక్క స్థానాపతియై యతని కరిగాపైన రాజరాజనరేంద్రుని సంస్థానమునకు వచ్చె ననియు, నన్నయభట్టారకునికి భారతరచనయందు తోడ్పడెననియు, దానికి బ్రతిఫలముగ రాజరాజనరేంద్రుడతనికి నందంపూండి గ్రామము నగ్రహారముజేసి యిచ్చెననియు దలచవలసియున్నది. కావున రాజరాజనరేంద్రుడు సోమేశ్వరుని యధికారము నంగీకరించెనని దృఢముగ జెప్పవచ్చును. సామంతరాజులు దమ్మేలిన సార్వభౌముల బిరుదావళిని వహించుట సహజముగుటచేతను, సోమేశ్వరచక్రవర్తిని బోలి తానును చాళుక్యవంశ సంభూతుడు గావునను 'సమస్తభువనాశ్రయ' 'సత్యాశ్రయ కులశేఖర' యను బిరుదులను స్వీకరించెను.

శాసనకాలము:— ఈ శాసనముయొక్క కాలము నిశ్చయించి చెప్పుటకు దగిన సాధనములు లేవు. శకవర్షముగాని, రాజ్యవర్షముగాని చెప్పియుండలేదు. 'సూర్యగ్రహణ నిమిత్తే ధారాపూర్వక మహ్యాభిద్దత్తమితి' అని యుండుటచే రాజరాజనరేంద్రుని రాజ్యకాలమున నెన్నడో యొక సూర్యగ్రహణమప్పుడీ దానము సేయబడెనని మాత్రము చెప్పవచ్చును. ఇంతకంటె సూక్ష్మముగ నీశాసనకాలమును గనుగొనుటకు వీలగునేమో చూతము. ప్రస్తుతము బరిష్కృతమగుచుండు నీ శాసన గ్రంథము నందంపూడి దాన శాసన గ్రంథమునకు సంగ్రహీకరణ మని పైని జెప్పియున్నాము. నందంపూండి శాసనము రాజరాజనరేంద్రుని ౩౨-వ రాజ్యవర్షమున, అనగా క్రీ.శ. ౧౦౫౧-వ సంవత్సరమున వ్రాయింపబడెను. కావున ప్రస్తుతశాసనమున వర్ణింపబడిన దానము తరువాతికాలమున నెప్పుడో సేయబడెనని స్పష్టమగుచున్నది. క్రీ. శ. ౧౦౫౧ కిని, రాజరాజనరేంద్రుని యంతిమరాజ్యవర్షమగు క్రీ. శ. ౧౦౬౧ కిని మధ్య నున్న పదియేండ్లలో పది సూర్యగ్రహణము లుండినట్లు తెలియవచ్చుచున్నది. ఆగ్రహణముల కాల మీక్రింద బొందుపఱచుచున్నాము.

(౧) ౨౩ నవంబరు ౧౦౫౨
(౨) ౧౩ నవంబరు ౧౦౫౩
(౩) ౧౦ మే ౧౦౫౪
(౪) ౨ నవంబరు ౧౦౫౪
(౫) ౨౨ అక్టోబరు ౧౦౫౫
(౬) ౧౨ సెప్టెంబరు ౧౦౫౬
(౭) ౨౨ ఆగస్టు ౧౦౫౭
(౮) ౧౫ ఫిబ్రవరి ౧౦౫౯
(౯) ౧౦ ఆగస్టు ౧౦౫౯
(౧౦) ౨౦ జూన్ ౧౦౬౦

ఈ పది గ్రహణకాలములలో నేదోయొక గ్రహణమప్పుడు రాజరాజనరేంద్రు డీ శాసనోక్తదానము జేసినట్లు జెప్పవలయును. లభ్యమైన సామగ్రి నాధారపఱచుకొని చెప్పదగిన దంతయు నింతే. ఇంతకంటె సూక్ష్మముగ నీదానకాలమును నిశ్చయించి చెప్పుటకు వీలుగాదు.

స్థలనిర్ధారణ:— దాన క్షేత్రము గుద్దవాడివిషయములోని మణ్ణగ్రామాంతర్గతమనియు, దాని హద్దులలో సప్తగోదావరినదియు వల్లూరు పెనుమాల లను రెండు గ్రామములు నుండినట్లును శాసనగ్రంథము దెల్పుచున్నది. గుద్దవాడివిషయము పూర్వచాళుక్య శాసనములలో నెన్నిటియందో పేర్కొనబడియున్నది. దీనికి గుద్రాహారవిషయ మనియు నామాంతరము గలదు. కృష్ణాజిల్లాలోని యిప్పటి గుడివాడయే ప్రాచీనగుద్రాహారము, లేక గుద్దవాడి యనియు, దానికి సంబంధించిన రాష్ట్రవిభాగమునకే గుద్రాహార, లేక గుద్దవాడివిషయ

1. రాజరాజనరేంద్ర పట్టాభిషేకవర్ధంతిసంచిక. పుటలు ౧: ౪-౫.

మనియు పరిశోధకుల యభిప్రాయమై యున్నది. ఈ శాసనమువల్ల నది సప్తగోదావరిపర్యంతమును వ్యాపించి యుండెనని స్పష్టమగుచున్నది.

మణ్డ యను పేరుగల గ్రామ మిప్పుడు సప్తగోదావరీతటమున నున్నట్లు తోచదు. రామచంద్రాపురం తాలూకాలో మండపేట యను గ్రామ మొకటి యున్నది. ఈ శాసనము లభించిన స్థలము మండపేటయే యగుటచేత శాసనకాలమునాటి 'మండ' కాలక్రమమున మండపేటగ మారెనేమో. సరిహద్దు గ్రామములలో నొకటియగు కల్లూరు మండపేటకు సమీపమున నుండుటచే నీయూహ సరియైన దని తోచుచున్నది. కాని యొక సంశయము గలదు. దాన క్షేత్రములలో నొకదానికి దక్షిణపు హద్దు సప్తగోదావరి యని యున్నది. మండపేటపొలము సప్తగోదావరీతీరము వఱకు వ్యాపించుచున్నదో లేదో తెలియదు. ఇదియే సంశయగ్రస్తవిషయము.

సప్తగోదావరి యన్నను, గోదావరి యన్నను నొక్క నదియొక్క నామాంతరములే. సముద్రసంగమమునకు కొంతదూరమున నేడు పాయలుగ చీలి ప్రవహించు గోదావరికే సప్తగోదావరియని పేరు. ఈ పాయలందు గౌతమి, కౌశిక, వసిష్ఠ, వైనతేయ లనునవి సుప్రసిద్ధములు.

ఆంధ్రపదములు:—శాసనభాష సంస్కృతమైనను దానవివరణసందర్భమున కొన్ని తెనుగుమాటలు గానవచ్చుచున్నవి. వీనియం దపరిచితమైనవానిని గూర్చి ఇంచుక చెప్పవలసియున్నది.

(౧) మున్మడిభీమకోల (పం. ౨౪-౨౫):— ఇది యొక భూమికొలతగడ. మున్మడి భీమమానిక యను కొలతపాత్ర యొకటి కొన్నిశాసనములయందు పేర్కొనబడియున్నది.[1] ఈ రెండు కొలమానములును మున్మడిభీమ డను నామాంతరము గల విమలాదిత్యుని కాలమున నిర్ణీతము లగుటచేత వీని కా పేరు వచ్చెను.

(౨) వడ్లపట్టు (పం. ౨౫):— 'అడ్లపట్టు' వంటిదే. ప్రాచీనపూర్వ చాళుక్యశాసనములలో గానవచ్చెడి 'అడ్లపట్టు' శబ్దము అడ్లు చల్లుటకు వలసిన భూమియని పరిశోధకు లభిప్రాయమును వెలిబుచ్చి యున్నారు. దీని ననుసరించి 'వడ్లపట్టు' నకు వడ్లు విత్తుటకు వలయు భూమి యని యర్థము చెప్పుకొనవలసియున్నది. ప్రస్తుతశాసనమున నీమాట మూడు పర్యాయములు ప్రయోగింపబడియున్నది: 'వడ్లపట్టు వరిక్షేత్రం' (పం. ౨౫), 'వడ్లపట్టు జొన్న క్షేత్రం', (పం. ౨౫-౨౬), 'వడ్లపట్టు తోంటపడకు క్షేత్రం' (పం. ౨౬). ఇట 'వరిక్షేత్ర' 'జొన్నక్షేత్ర' 'తోంట పడకు క్షేత్ర' పదములతో 'వడ్లపట్టు'ను జంటించి చెప్పియుండుటచేత దీనికి 'వడ్లు' అనగా వరి జల్లుటకు వలయు నేల యని యర్థవివరణము నీయుట కనుకూలము గాదు. 'వడ్లు' అనగా 'బీజములు' 'విత్తనములు' అని యర్థము చేసికొనవలయును. 'విత్తనాల పట్టు' అను మాట ఇప్పటికిని నెల్లూరుమండలమున వాడుకయం దున్నది. ఇతరమండలములగూడ వ్యవహారమున నుండవచ్చును. ఇద్దుము విత్తనాల పట్టు, పందుము విత్తనాల పట్టు ఇత్యాది. కావున నీసందర్భమున వడ్లపట్టు భూపరిమాణమును దెల్పు శబ్ద మని గ్రహించవలయును.

(౩) 'పడకు' (పం. ౨౬):— 'ఒకొక్క పుట్టియుం బందుము వడ్లపట్టు పడకు క్షేత్రంచ' అని. 'పడకు' అనగా నేమో తెలియదు. వరిక్షేత్ర, జొన్నక్షేత్రముల వలె తోంటక్షేత్ర మనక తోంటతోగూడ 'పడకు'ను చేర్చియున్నది. సార్థానుప్రాసమైన 'పడకు' శబ్ద మొకటి శబ్దరత్నాకరమున గానవచ్చుచున్నది. దీనికి 'సందు', 'గుహ' యను రెండర్థములను సీతారామాచార్యులవారు నిర్వచించియున్నారు. ఈయర్థము లిచట ననుకూలింపవు. అరవమందు 'పడుక్కై, పడుకర్' అను రెండు మాటలు గలవు. వీనిలో మొదటిదానికి వ్యవసాయమున కనువైన నదీతీరభూమి యనియు, రెండవదానికి వ్యవసాయమున కర్హమైన పొలమనియు అర్థమును దమిళ్ నైఘంటుకులు చెప్పుచున్నారు. తెనుగు, 'పడకు'నకును అరవ'పడుక్కై' 'పడకర్'లకును జ్ఞాతిత్వము గలదు. కావున 'తోంట

1. ARE 748 of 1920.

ములును, మండశాసనములో 3 శ్లోకములును నన్నియ భట్టరచితము లని చెప్పవచ్చును. మణ్డశాసనములోని 'ఇంద్రో యథా', 'సంరక్షతి క్షితితలం', 'సవ్యాగ్రేణ కులం' అను నన్నయవిరచితశ్లోకత్రయమును నందంపూండిశాసనగ్రంథమున గానవచ్చుచున్నవి. ఈ కారణముచేతను, నందంపూండిశాసనములోని చాళుక్య ప్రశస్తికంటె మణ్డశాసనప్రశస్తి సంకుచిత మగుట చేతను నిది నందంపూండిశాసనగ్రంథమునకు సంగ్రహ మని పలికితిని. చాళుక్య ప్రశస్తిగ్రంథము నంతటిని నన్నియభట్టు తన కప్పటికి లభించిన పూర్వ చాళుక్య శాసనములనుండి గ్రహించెను.

నందంపూండి మణ్డశాసనములలోని చాళుక్య ప్రశస్తి ఎచ్చటినుండి నన్నియ కైకొనియెనో తెల్పుటకై క్రిందిపట్టిక యందు దండలి శ్లోకములను, నవి గానవచ్చెడి పూర్వచాళుక్యశాసనములను బొందుపఱచుచున్నాడను.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧. శ్రీధామ్నః పురుషోత్తమస్య ... | రణస్తిపూండి | కోరుమిల్లి | కలిదిండి | నందంపూండి | మండ |
| ౨. తస్మా దాసీత్ ... | ,, | ,, | ,, | ,, | ,, |
| ౩. గంగాయమునాతీరే ... | ,, | ,, | — | ,, | — |
| ౪. పుత్రా స్తస్య ... | ,, | ,, | కలిదిండి | ,, | — |
| ౫. యేనాదాహి విజిత్య ... | ,, | ,, | ,, | ,, | — |
| ౬. తస్యాసీ ద్విజయాదిత్యో ... | ,, | ,, | ,, | ,, | మండ |
| ౭. అమ్మరాజానుజో ... | — | ,,* | ,, | — | ,, |
| ౮. తం యుద్ధమల్లం పరిహృత్య ... | రణస్తిపూండి | — | — | నందంపూండి | — |
| ౯. సత్పుత్రేణా దశరథ ... | — | — | కలిదిండి | — | మండ |
| ౧౦. తత్సూనుర్విజ్ఞనతారాతి ... | రణస్తిపూండి | — | — | నందంపూండి | — |
| ౧౧. దైవాతురోమ్మనృపతేః ... | ,, | కోరుమిల్లి† | — | ,, | మండ |
| ౧౨. అనుదావార్ణవా ... | ,, | — | — | ,, | ,, |
| ౧౩. అత్రాన్తరే ... | ,, | — | — | ,, | ,, |
| ౧౪. తత స్తదనుజో ... | — | — | — | ,, | — |
| ౧౫. తేజో యదీయ ... | — | — | — | ,, | — |
| ౧౬. తస్మా ద్విమలాదిత్యాద్రవికుల ... | — | — | — | ,, | మండ |
| ౧౭. యస్సోమవంశతిలక ... | — | కోరుమిల్లి‡ | — | ,, | ,, |
| ౧౮. ఇంద్రో యథా ... | — | — | — | ,, | ,, |
| ౧౯. సంరక్షతి క్షితితలం ... | — | — | — | ,, | ,, |
| ౨౦. సవ్యాగ్రేణ ... | — | — | — | ,, | ,, |
| ౨౧. పిత్రోర్వ్యంశసుధా ... | — | కోరుమిల్లి | — | ,, | — |
| ౨౨. యస్యస్ఫార ... | — | — | — | ,, | — |

ఈపరిశీలనవల్ల నన్నియభట్టవిరచితము లనబడు నందంపూండిమణ్డశాసనములలోని చాళుక్యవంశవర్ణనాత్మకమైన శ్లోకములు ఏడు తప్ప తక్కిన నన్నియ దత్పూర్వపు చాళుక్యశాసనములనుండి సంగ్రహింపబడె నని స్పష్టమగుచున్నది. ఆ యేడును మన కింతవఱకును లభ్యముకాని శాసనములనుండి కైకొనియుండవచ్చును.

ఇక నీప్రశస్తిలో గద్యభాగమునుగూర్చి కొంచెము చెప్పవలసియున్నది. ప్రాచీనపూర్వచాళుక్య శాసనము లన్నియు గద్యాత్మకములే. దానఫలశ్రుతి శ్లోకము లన్నిటను గలవు. వాని విషయము ప్రస్తుతము చర్చించలేదు. ఇవి 'స్వస్తి శ్రీమతాం సకలభువనసం

* పాఠాంతరము.

† పాఠాంతరము.

‡ 'యస్సోమవంశతిలకః' అనుటకు బదులు 'రోరక్షితుం వసుమతీం' అని యారంభమగుచున్నది.

స్తూయమానమానవ్యసగోత్రాణాం' అని యారంభమగు చున్నది. గుణగవిజయాదిత్యుని కాలమునుండియు వంశానుక్రమణిక దీనితో జతచేయబడినది. ఇప్పటినుండి వంశానుక్రమణికలో నచటనచట శ్లోకములను జొప్పించు నాచారము ప్రారంభమైనది. మొదటి శక్తివర్మకాలమునకు శ్లోకములసంఖ్య యతిశయమైనది. కాని విమలాదిత్యుడు పౌరాణికవంశక్రమమును జేర్చుటచే శాసనములయందు మరల గద్యభాగ మతిశయించినది. శ్లోకములు తరుచుగ మారుచువచ్చినను గద్యభాగమన్నిటను స్వల్పవ్యత్యాసము లున్నను నొక్కతీరునసేయున్నది. పౌరాణికవంశవర్ణన రెండుతెఱగుల గానవచ్చెడిని : (౧) 'తస్మాదాయు రాయుషో నహుషః నహుషా ద్యయాతి'—ఇది యొక పద్ధతి. (౨) 'తస్మాదాయు స్తతో నహుషస్తతో యయాతిః' — ఇది రెండవది. నన్నియకోట్టు నందంపూడి శాసనమున మొదటి పద్ధతిని, మణ్ణశాసనమున రెండవ పద్ధతిని అవలంబించియున్నాడు. మాటలలో నించుక భేదము గానవచ్చుచున్నను విషయమందు విశేషవ్యత్యాసము గానరాదు.

నాచే దయారుసేయబడిన శాసన మూల గ్రంథమును మాతృకతో బోల్చి సరిచూచినందులకు గవర్నమెంటు ఎపిగ్రాఫిస్టు గారగు శ్రీ రావుబహదూరు సి. ఆర్. కృష్ణమాచార్యులు బి. యే. గారికి కృతజ్ఞతాపూర్వక నమస్కారములను సమర్పించుచున్నాను.

# శాసన మూలము

మొదటిరేకు : రెండవప్రక్క

౧ శ్రీధామ్నః పురుషోత్తమస్య మహతో నారాయణస్య ప్రభో ర్నాభీపంకరుహా ద్బభూవ
జగతః స్రష్ట[1] స్వ [కరః సుధాంశు
౨ యంభూ స్తతః। జజ్ఞే మానససూను రత్రి రితి య స్తస్మా న్మనే[2] రత్రితః సోమో వంశ
3 రుదితః శ్రీకణ్ట[3]చూడామణిః ॥[౧[3a]॥*]తస్మా దభూ త్సుధాసూతే ర్బుధో[3b]బుధనుత
స్తతః। జతః[4] పురూరవా [క[త్రా]] తతః ప్రాచీశ స్తతః సైన్యయాతి స్తతో హ
౪ నామ చక్రవర్తీ [నవిక్రమః॥౨[4a]॥*] తతో జనమేజయో[ఽ*]శ్వమేధత్రితయస్య
౫ యపతి స్తతః సార్వభౌమ స్తతో జయసేన స్తతో మహాభౌమ స్తస్మా దైశానక స్తతః
క్రోధానన స్తతో దవ[5] [స్తతః కాత్యాయ[న]
౬ కి స్తస్మా దృభుక స్తస్మా దృక్షక[6] స్తతో మతివర స్సత్రయాగయాజీ సరస్వతీనదీనాథ
౭ స్తతో నీల స్తతో[6a]దుష్యంత స్తతో భరత స్తతో భూమన్యు స్తత స్సుహోత్ర స్తతో
హస్తీ తతో విరోచన స్త[స్మా] [సే న స్త[తః]
౮ దజమీల స్తతః [స]ంవరణ స్తస్య తపనసుతాయా స్తపత్యాశ్చ సుధన్వా[7] [త]తో భీ[మ
౯ ప్రదీపన స్తతః శన్తను స్తతో విచిత్రవీర్య స్తతః పాండురాజ స్తతః పాణ్డవా
స్తే[షామ] ర్జున [స్తతః శతానీక
౧౦ నా దభిమన్యు స్తతః పరిక్షిత్ త[8]తో జనమేజయ స్తతః క్షేముక స్తతో నరవాహన

---

1. 'స్రష్టా' అని చదువవలయును. 2. 'న్మునే' అని. 3. 'శ్రీకణ్ఠ' అని. 3a. శార్దూలవిక్రీడితము. 3b. 'బ్బుధో' అని. 4. 'జాత' అని 4a. అనుష్టుభ్. 5. 'దేవ' అని. 6. 'దృక్షక' అని. 6a. 'తో' అని. 7. 'సుధన్వా' అని. 8. 'తతో'లోని మొదటి 'త' యొక్క తలకట్టు కొంచె మించుమించుగా ఎత్వమువలె చెక్కియున్నది.

మూడవరేకు : రెండవప్రక్క



ముద్రిక



౧౧ స్తస్మా దుదయన స్తతః పరం తత్ప్రభృతి ష్వవిచ్ఛిన్నసన్తానే ష్వయోధ్యాసింహా
[స*] నాసీనేష్వేకాన్నషష్టిచ [గత్వా త్రిలోచనప
౧౨ క్రవర్తిషు[గతే][1]షు తద్వంశ్యో విజయాదిత్యా[2]నామరాజ[3]విజిగీషయా దక్షిణాపథం
౧౩ ల్లవ మధిక్షిప్య దైవదురీహయా లోకాన్తర మగమత్। తస్మిన్ సంకులే తస్య మహా
దేవీ[4]వృద్ధామాత్యై [యాజినా దుహితృని[ర్వి]
౧౪ స్సార్థం ముతివేము[5]నామాగ్రహార ముపగ మ్యైకద్వ్యాస్తవ్యేన విష్ణుభట్టసోమ
౧౫ శేష మభిరక్షితా సతీ సన్దన మసూత।[6]సా తస్యచ కుమారస్య మానవ్యసగోత్రహారీ

---

1. 'గతే' అను రెండక్షరములును మొదట వేరేదో వ్రాసి తుడిచిన తుడుపుపై జెక్కబడియున్నవి. 2. 'త్యో' అని. 3. 'జా' అని. 4. 'వీ' అని. 5. 'ముడివేము' అని. 6. ఈ నిలువుగీటు కున్నవలె బహుసూక్ష్మముగా చెక్కబడియున్నది.

రెండవ రేకు : మొదటిప్రక్క

౧౬ తిపుత్ర ద్విషత్కృమోభితాని[1] కర్మ్మాణి కారయిత్వా [సమర్ధయ]త్ [।*]నచ మాత్రా విదితవ్య [మాతృగణాంశ్చ

౧౭ త్రాన్తస్సన్నిర్గత్య చలుక్యగిరౌనన్దాం భగవతీం గౌరీ మారాధ్య కుమా[రనారాయ]ణ

౧౮ సంతర్ప్య శ్వేతాతపత్రకశంఖపాలికేతనప్రతిధక్కా వరాహలాంచన[1a] మకరతోరణ పంచమహో [నిహీ

౧౯ శబ్దబర్హ కున్తచామర కనకదణ్డసింహాసన గంగ యమునాదీని స్వకులక్రమాగతాని

౨౦ ష్టాని[2]వ సామ్రాజ్యచిహ్నాని సమాదాయ కదంబగంగ భూమిపా న్నిర్జిత్య[3] సేతునర్మ్మదామధ్యం సార్ధ [పల్లవా

౨౧ న ప్తలక్షం దక్షిణాపథం పాలయామాన[।][4]తస్యాసీ ద్విజయాదిత్యో విష్ణువర్ధన భూపతేః

౨౨ న్వయజతాయా[4a] మహాదేవ్యాశ్చ నందన[ః॥3॥[5]*] తత్సుతః పులకేశి[5a]వల్లభఃతత్పుత్రః కీర్త్తివర్మ్మా తస్య తనయః[।]

౨౩ శ్రీమతాం సకలభువన సంస్తూయమాన మానవ్యసగోత్రాణాం హారీతిపుత్రాణాం కౌశి

౨౪ కీవర[6]ప్రసాదలబ్ధరాజ్యానాం మాతృగణపరిపాలితానాం స్వామిమహాసేనపాదాను

౨౫ ధ్యాతానాం భగవన్నారాయన[7]ప్రసాదసమాసాదిత వరవరాహలాంచనే[8]క్షణ క్షణవ

౨౬ శీకృతారాతిమణ్డలానా మశ్వమధా[9]వభృథ పవిత్రీకృతవపుషాం చాలుక్యానాం కుల

౨౭ మలంకరిష్ణోః సత్యాశ్రయ వల్లభేంద్రస్య భ్రాతా కుబ్జవిష్ణువర్ధనో[ఽ*]ష్టాదశవర్షాణి వేంగీదేశ

౨౮ మపాలయత్। తదాత్మజో జయసింహవల్లభ స్త్రయస్త్రింశతం తదనుజ ఇంద్రరాజఃసప్తది

౨౯ నాని తత్సుతో విష్ణువర్ధనో నవవర్షాణి తత్సూను మ్మంగియువరాజః పంచవింశతిం తత్పుత్రో జ

30 యసింహ స్త్రయోదశ తదనుజః కొక్కిలిః షణ్మాసాః తస్య జ్యేష్ఠో భ్రాతావిష్ణువర్ధన స్తము [విష్ణువ

3౧ ర్ధ్యాట్య సప్తత్రింశత మబ్దాః తత్సుతో విజయాదిత్యభట్ట[10]రకో[ఽ*]ష్టాదశ తత్పుత్రో

రెండవరేకు : రెండవప్రక్క

3౨ ర్ధనః షట్త్రింశతం తత్తనయో నరేంద్రమృగరాజ శ్చాష్టాచత్వారింశతంతత్సూనుః కలివిష్ణు[వ] [తద్భ్రాతు విక్రమాదిత్య[11]

33 ర్ధనో[ఽ*] ద్యర్ధవర్షం। తత్పుత్రో గుణగ విజయాదిత్య శ్చతుశ్చత్వారింశతం

---

1. 'క్రమోచితాని' అని. 1a. 'లాంఛన' అని. 2. 'నీవ' అని. 3. 'న్నిర్జిత్య' అని. 4. ఈ నిలువుగీటు కడు సూక్ష్మముగ చుక్కవలె గానవచ్చుచున్నది. 4a 'జాతాయా' అని. 5. అనుష్టుభ్. 5a. 'పులకేశి' అని. 6. 'వర' అని. 7. 'న్నారాయణ' అని. 8. 'లాంఛనే' అని. 9. 'మేధా' అని. 10. 'భట్టా' అని. 11. 'తద్భ్రాతు ర్విక్రమాదిత్య' అని.

౩౪ స్య తనయ శ్చాలుక్య[1]భీమ స్త్రింశత[ం] తత్సుతః కొల్లబిగణ్డ[2] విజయాదిత్యః షణ్మాసా
తత్సూను రమ్మ [తం జిత్వా చాలుక్యభీ[3]
౩౫ రాజః సప్తవర్షాణి తత్సుతం విజయాదిత్యం బాలముచ్చాట్య తాడపో మాస మేకం
౩౬ మతనయో విక్రమాదిత్య ఏకాదశ మాసా తత్తాడపరాజసుతో యుద్ధమల్లస్సప్త
వర్షాణి ।[4।*] అమ్మరా [ద్వ్యకం। [।౪॥7a*] నత్పుత్ర [యో]
౩౭ జనుజో[5] రాజభీమో భీమపరాక్రమః [।*] విజిత్యయుద్ధమల్లం త[6]ద్వాదరాబ్దా[7] నపా
౩౮ ద్దశరథప్రతిమస్య తస్య భీమస్య రామభరతోపమయోః కనీయా। దానార్ణవా[8]
మ్మనృప [యో*] రథ పం [తే ద్దాన నృపో రాజభీమ
౩౯ చవింశ త్యబ్దా నరక్ష దవనీతల మమ్మరాజః। [।౫॥*][8a] ద్వైమాతురో[9] [౽*]మ్మనృప
౪౦ నృపతనయః [।] విద్యాకలాపచతుర[10]మహీ మపా త్సమా స్త్రిత్క్రః[11]।[।౬॥*] అను
దానార్ణవా[12] దాసీ ద్దై
౪౧ వకుశ్చేష్టయా తతః[।*] సప్తవింశతి వర్షాణి వేంగీ మహీరనాయికా।[13][।౭॥*]
అత్రాన్తరే దానన రేంద్రసూనుః శ్రీశ
౪౨ క్తివర్మా సురరాట్సధర్మా। యః శౌర్యశక్త్యావినిహాత్య శత్రూ[14]నద్వాద
శాబ్దా సమరక్ష దుర్వీం। [।౮॥*][15] [త]
౪౩ త స్తదనుజో వీరో విమలాదిత్య భూపతిః [।*] మహీ మపా త్సమా స్సప్త సప్తసప్తి
సమద్యుతిః ।[।౯॥16*] త [రాజ
౪౪ స్మా ద్విమలాదిత్యా ద్రవికుల[17]లక్ష్మ్యాశ్చ కుదవ[18]మహా దేవ్యాః। నిజగుణవశీకృతాఖిల
౪౫ న్యే[19] రాజరాజవిధు[20]రజని[21]॥[౧౦॥*] యః సోమవంశతిలకః శకవత్సరేషు వేదాబు[22]
రాశి నిధిన త్రిషు[23] సిం
౪౬ హాగతే౽ర్కే।[24]కృష్ణ ద్వితీయదివసో త్తర భద్రికాయా (।) వారే గురో వ్వణిజి లగ్న
వరే [౽*] భిషిక్తః॥[25][౧౧॥*] ఇన్ద్రో యథా దివ
౪౭ ముదారాయు[26]శ్శా స్తథోర్వీం శౌర్యేణ శశ్వ దఖిలా మభిరక్షితుం యః శ్రీవిష్ణు
వర్ధన[27]నృపోమకు

---

1. 'శ్చాలుక్య' అని. 2. 'కొల్లభిగండ' అని. 3. 'భీ' అని. 4. ఇచటి నిలువుగీటు కడు సూక్ష్మమైనది. 5. 'రాజానుజో' అని. 6. 'తం'అని. 7. 'ద్వాదశాబ్దా'అని. 7a. అనుష్టుభ్. 8. 'దానార్ణవా'అని. 8a వసంత తిలక. 9. 'ద్వైమాతురో'అని. 10 'చతురః'అని. 11. 'చతురంతిమహీమపా త్స మా స్త్రిస్రః'అనియుండవల యును. ఆర్యా. 12. 'దానార్ణవా' అని. 13. 'నాయకా' అని. అనుష్టుభ్. 14. 'శత్రూన్' అని. 15. ఇంద్రవజ్రా. 16. అనుష్టుభ్. 17. 'కుల' అని. 18. 'కుందవ' అని. 19. 'న్యో' అని. 20. 'విధు' అని 21. ఆర్యా. 22. 'వేదాంబు' అని. 23. 'వర్తిషు' అని. 24. ఈ నిలువుగీటుకు బదులిచట నొకచుక్క కలదు. నిలువుగీటు శాసనమున గ్రమక్రమముగ సూక్ష్మతరమగుచువచ్చి కడపట చుక్కరైమారినది. 25. వసంతతిలక. 26. 'ముదారయు' అని. 27. 'వర్ధన' అని.

మూడవరేకు : మొదటిప్రక్క

౨౮ టం పరార్ధ్యఽం మూర్ధ్నా దధా న్మణిమయూఖ[1]విభాసితాశాం।[2][౧౨॥*]సంరక్షతి క్షితి
తలం క్షపితారివర్గే మార్గే[3] [కలిక[6]

౨౯ ణ యత్రా[4]నయశాలిని మానవేన। ప్రీతాః ప్రజ[5]నిజపవిత్ర చరిత్రతో వైః ప్రక్షాలయని

౩౦ లకలంకపంకం।[7][౧౩॥*]సన్మార్గేణ కులం కలాగమపరిజ్ఞనేన[8] శుద్ధాం ధియ స్దీనానాథ
జనార్తి[9] తార్థఽనివహా [మోదిక్ష్వక మలంక

౩౧ త్యాగేన లక్ష్మీం సిరాం[10] సంపూర్ణా్ణఽ[11]మలచంద్రికావిశదయా కీర్త్యా[12] జగద్దీశయా

౩౨ రోతి నితరాం చాలుక్యచూడామణిః।[13][౧౪॥*] స సర్వ్వఽలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధఽన
మహారాజధిరాజో[14]రాజ [మణ్డ

౩౩ పరమేశ్వరఃపరమభట్ట[15] రకః పరమబ్రహ్మణ్యః[15a] శ్రీ రాజరాజదేవో గుద్దవాడివిషయే

౩౪ నామగ్రామ మధివసతో రాష్ట్రకూటప్రముఖా[16]కుటుంబినః సమాహ్వాయ[17] సర్వ్వఽ
ప్రధానసమ [శివకుమ[19]

౩౫ క్షమిత్థ మాజ్ఞపయతి[18] [।*] యథా ఆపస్తంబసూత్రాయ భారద్వాజగోత్రాయ

౩౬ రభట్టస్య పౌత్రాయ స్వధర్మ్మాఽనుష్ఠానపరస్య రామదేవస్య పుత్రాయ సమస్త భువ
నాశ్ర

౩౭ శ్ర[20]యబ్రహ్మమహారాజ ఇతి ప్రసిద్ధాయ అంకయనామ్నే మణ్డదక్షిణక్షేత్రే ముమ్మడి

౩౮ భీమకోలము[21]ప్రదివుట్ల వడ్లపట్టు వరిక్షేత్రాం[21a] [।*] ఉత్తరదశి ముమ్మడిభీమకోలం
బదివుట్లవడ్ల [[ం]చ పన్నసంజ్ఞక

౩౯ పట్టు బొన్నక్షేత్రం[22]చ[౧*]ఒక్కొపుట్టియుం బ[ం]కుమువడ్లపట్టుతోంటపడకుక్షేత్ర

౪౦ త్వ్య సూర్యఽగ్రహణనిమిత్తేధా రాపూర్వ్వఽకమస్మాభి ర్దఽత్తమితి విదితమస్తు వః[।*]
అత్ర దక్షిణక్షే

౪౧ త్రపన్నసీమానః పూర్వ్వఽతః వల్లూరి పొలగరుససీమా॥ దక్షిణతః ఊరిమధ్యమున గుం

౪౨ టయ సీమా॥ పశ్చిమతః కొలపుట్టతోడిగుంటయసీమా॥ ఉత్తరతః పెనుమాల అల

౪౩ మసీమా॥ ఉత్తరక్షేత్రపన్నసీమానః పూర్వ్వఽతః చిన్తతోడిపుట్టయసీ॥[23]దక్షిణ[24]స ప్త

---

1. 'మూర్ధ్నాఽదధా న్మణిమయూఖ' అని. 2. వసంతతిలక. 3. ఈపంక్తిలోని 'వర్గేఽమార్గేఽ'లోను, ౩౦-వ పంక్తిలోని 'సన్మార్గేఽ'లోను 'ర్గేఽ' యను నక్షరము స్థూలదృష్టిని 'ర్గో'వలె గాన్పించినను సూక్ష్మముగ బరిశోధించి చూచిన నది 'ర్గేఽ' యనియే చెప్పవలసియున్నది. 4. 'యత్ర' అని. 5. 'ప్రీతాః ప్రజాః' అని. 6. 'ప్రక్షాలయన్తి కలికా' అని. 7. వసంతతిలక. 8. 'పరిజ్ఞానేన' అని. 9. 'జనార్తిఽ' అని. 10. 'స్థిరాం' అని. 11. 'సంపూర్ణ్ణాఽ'అని. 12. 'కీర్త్యాఽ' అని. 13. శార్దూలవిక్రీడితము. 14. 'రాజాధిరాజో' అని. 15. 'ట్టా' అని. 15a 'బ్రహ్మణ్యః' అని. 16. 'ప్రముఖాఽ' అని. 17. 'సమాహూయ' అని. 18. 'మాజ్ఞాపయతి' అని. 19. 'కుమా' అని. 20. 'శ్ర' రెండుపర్యాయము లనావశ్యకముగ జెక్కబడియున్నది. 21. ఇది ప్రాచీన'ము'వలెగాక ఇప్పటి 'ము'వలె వ్రాయబడియున్నది. 21a. 'త్ర'అని. 22. 'బొన్న క్షేత్రం' అని. 23. 'సీమా'అని. 24. 'దక్షిణతః'అని.

మూడవ రేకు : రెండవ ప్రక్క

౬౪ గోదావరియసీమా॥ పశ్చిమతః బీమియరట్టడిత్రోవిణ్డియసీమా॥ ఉత్తరతః గుంటయ
౬౫ సీమా॥ సర్వకరపరిహృత స్యాస్య యాచనము మాడ ఒక్కొణ్డ[1][౧*]ఊరితూప్పూర్వాన
నుణ్ణి పడుమ [న కేన
౬౬ టికిం బాటిన పెద్దవిధి[1a] దక్షిణమున గృహక్షేత్రమున వూ[2]ఙ్లనలుపది [।*] అస్యోపరి
౬౭ చి ద్బాధా కరణీయా యః కరోతి సం[3] పంచమహాపాతకయుక్తో భవతి [॥*] తథా[4]
చోక్తంవ్యాసేన [॥*] స్వదత్తాం [జాయతే క్రిమిః[॥*5] ౧౫॥]రితి [॥*]అజ్ఞప్తి
౬౮ పరదత్తాంవా యోహరేత వసున్ధరాం [।*] షష్టిం వర్షసహస్రాణి విష్ఠాయాం
౬౯ రస్య కటకరాజః [।*] కర్త్తా నన్నియభట్టః [।*] లేఖకో గణ్డాచార్య్యః॥

1. 'ఒక్కొణ్డ' అని. 1a. 'వీధి' అని. 2. మొదట 'వు' వ్రాసి తరువాత దాని కొమ్మును దుడిచి 'వూ'గ మార్చినట్లున్నది. 3. 'సః' అని. 4. 'తథా' అని. 5. అనుష్టుభ్.

---




ఆంధ్రుల మానసికోత్సవములు—౨. ఆవకాయ అమావాస్య (తిరువీథి)

# జాకీ

[కథ]

= శ్రీ 'కరుణకుమార' =

౧

ఆ జమీందారుగారికి కుక్కలంటే యెంతో ప్రీతి.

సాలుకు నాలుగు లక్షల ఆదాయం వచ్చే ఎస్టేటు. నూరూ నూటా ఇరవై గ్రామాలవరకూ ఉన్నవి వారి ఎస్టేటులో. చిన్నదయినప్పటికీ ఆనాడినుండీ ఆంధ్రదేశంలో పేరు పడ్డ సంస్థానాల్లో ఈ జమీందారుగారి సంస్థానం ఒకటి.

ఆ జమీందారుగారిది ఆర్వేలనియోగుల శాఖ. వారి తండ్రిముత్తండ్రు లెవ్వరూ ఇట్లాంటి కుక్కల పిచ్చి యెరగరు. వాళ్ల హయాంలో తాహతుకు తగినట్లు ఒకటో రెండో ఏనుగులూ, పది పన్నెండు గుర్రాలూ, ఒక లొట్టిపిట్టా ఇట్లాంటివి జమీందారీ దర్జానిమిత్తం కొన్ని దివాణంలో పెంచుతూండేవారు. అట్లాంటిది మన జమీందారుగారికి ఎట్లా వచ్చిపడిందో- ఈ కుక్కలపిచ్చి సంప్రాప్తమైంది.

అమాంబాపతుయెట్లా లేదన్నా సాలుకు నలభై ఏభై వేల రూపాయల వరకూ వారికి కుక్కల పెంపకం మీద శలవు అవుతూవుంటుంది. ప్రపంచంలో ఏయే దేశాల్లో ఎట్లాంటికుక్క లున్నవో రకరకాల భైరవమూర్తులను పరిశీలించి ఒక్కొక్క రకానికి, ఒక్కొక్క జాతికి, ఒక్కొక్క లక్షణానికి ఒక ఆడా మొగజంటల్ని తెప్పించి సంస్థానంలో పెట్టి పోషిస్తున్నారు. పంచపాండవుల్లో నకులుడు ప్రత్యేకం అశ్వశాస్త్రంలో ప్రవీణు డయినట్లు, సహదేవుడు పశుశాస్త్రంలో ప్రవీణు డయినట్లు మన జమీందారుగారు శునకశాస్త్రంలో గొప్ప ప్రావీణ్యం సంపాదించారు. ఒక్కసారి కన్నెత్తి చూచినట్లయితే, ఒక్కొక్క కుక్క జన్మ, దాని గుణసంపత్తి, లక్షణమూ జ్యోతిషం చెప్పినట్లు ఆమూలాగ్రంగా ఏకరువుపెట్టగల అసాధారణశక్తి వారిది. అదిగాక ఎటువంటి పొగరు మోతు గ్రామసింహమైనాసరే, మన జమీందారుగారి సమక్షంలో పడి వారి ముఖావలోకనం చేసిందంటే, తోకముడుచుకొని పిల్లివలె తల క్రిందికి వంచి వారి పాదాలదగ్గర జోహారనవలసిందే. మరి శ్రీవారివద్ద ఉన్న ఆమాహాత్మ్యం ఏమిటో!

కుక్కలకొరకు వారు తమ సంస్థానంలో ప్రత్యేకంగా రెండు పెద్ద మహాడీలు కట్టించారు. ఒక్కొక్క మహాడీకి క్రిందివరుసలో పాతిక గదులూ, పైవరసలో పాతిక గదులూను. ఒక్కొక్క గదికి ఒక్కొక్క జాతి కుక్కలజంటచొప్పున నూరు గదులకూ నూరు శునకదంపతులు ఎప్పుడూ వారి సంస్థానంలో పెరుగుతూవుంటవి. న్యూఫౌండులాండు కుక్కలు, ఇంగ్లండుకుక్కలు, ఫ్రాన్సుకుక్కలు, అమెరికాకుక్కలు, జర్మనీకుక్కలు—ఒకరకమేమిటి, ఒక దేశమేమిటి, నానాజాతి కుక్కలసమితికి జమీందారుగారి సంస్థానం ఆటపట్టు. పెద్దపులులనూ, సింహాలనూ, ఏనుగులనూ వేటాడి అమాంతంగా కొరికి ముక్కలుచేయగల సాహసం గలిగిన వేటకుక్కలు కొన్ని, ముఖంమీద కళ్లయినా కనపడకుండా నఖశిఖపర్యంతమూ మూరెడు బొచ్చుతో ఉండే పొట్టి కుక్కలు కొన్ని, ఒంటిమీద ఒక్క రోమమైనా ఉన్నదో లేదో అన్నట్టుగా రబ్బరువలె నున్నటిదేహం గల కుక్కలు కొన్ని, బొచ్చుకుచ్చుతోకలు గల

కుక్కలు కొన్నీ, డోలువాయిద్యగాని కుడిచేతిలో ఉండే పుల్లవలె చివర వంగిన సన్నని తోకలు గల కుక్కలు కొన్నీ, నల్లవి కొన్నీ, ఎఱ్ఱవి కొన్నీ, తెల్లవి కొన్నీ, బట్టవి కొన్నీ, చింతపువ్వువన్నెవి కొన్నీ, గోధుమవన్నెవి కొన్నీ, ఎఱ్ఱగా చింత నిప్పులాగా కణకణలాడుతో ఉండే కన్నులు గల కుక్కలు కొన్నీ, పిల్లికళ్లకుక్కలు కొన్నీ, కాటుకకళ్ల కుక్కలు కొన్నీ — ఒకరకం ఏమిటి, అనేకరకరకాల కుక్కలు ఆసంస్థానంలో. మన రాజాగారికి దేశకుక్కలంటే మాత్రం సుతలామూ సరిపడదు. జాతికుక్కలమీదనే వారి కెంత సేపూ మోజు. అందుచేత శ్రీవారి సంస్థానంలో ఒక్క దేశకుక్కకయినా ఆస్కారం లేకుండా పోయింది.

కుక్కలమహలులో ఒక్కొక్క గదిలో ఒక్కొక్క శునకముల జంట. వాటికి విశాలమైన పెద్ద పడకమంచం, స్నానపుతొట్టి, పాయిఖానా, ఒక మేజాబల్ల, బల్లమీద ఒక నిలువుటద్దం, భోజన పాత్రలూను. ఆకుక్కలను సంరక్షణ చేయడానికి — అనగా రోజూ వేడినీళ్లతోనూ, సబ్బుతోనూ స్నానాలు చేయించి, చలవచేసిన తువాళ్లతో తుడిచి వాటిని శుభ్రపరచడానికీ, చాకిరీచేయడానికీ డెబ్బయి ఎనభైమంది నౌకర్లూ, చాకర్లూనూ. విదేశాల్లో పుట్టి సమస్తమైన భోగభాగ్యములూ అనుభవించే కుక్కలు తమమూలాన్న ఇంత దూరదేశానికి సముద్రాలు దాటి, వచ్చినందుకు, సుకుమారమైన ఆ శునకరాజములకు కటువైన హిందూదేశపు శీతోష్ణస్థితులు సరిపడునో, సరిపడవో అని రాజాగారు ఆకుక్కలవిషయమై కంట్లో వత్తివేసుకొని అన్ని ఏర్పాట్లూ పరిశీలించి కాపాడుతూ ఉంటారు. వాటికి చలికాలంలో ఫ్లానల్ చొక్కాలూ, ఎండాకాలంలో గ్లాస్గో మల్లుచొక్కాలూ కుట్టించి సప్లయి చేయించారు. సాయంకాలం షికారుకు పోవలసినప్పుడు వేయవలసిన డ్రస్సు వేరూ, రాత్రి పండుకొనేటప్పుడు వేయవలసిన డ్రస్సు వేరూ, ఉదయం బ్రేక్‌ఫాస్టు అప్పుడు వేయవలసిన డ్రస్సు వేరూ !

ప్రతిరోజూ పుదయం ఒక గంటసేపూ, సాయంత్రం ఒక గంటసేపూ నౌకర్లు కుక్కలజంటల్ని మెడకు కట్టిన వెండి బంగారుపూత గొలుసుల్ని చేత పట్టుకొని బయటికితీసి, మహాడీలకు చుట్టూ ఉన్న ఆవరణలోని ఉద్యానవనంలో విహారముగా తిప్పుతూ ఉంటారు. ఆసమయాల్లో జమీందారుగారూ, వారి సతీమతల్లికూడా ఒకసారి కుక్కల మహాడీలకు వేంచేపుచేసి, వాటి అభివృద్ధిని స్వయంగా పరీక్షిస్తూ నౌకర్లు కుక్కలసేవలో అప్రమత్తులై ఉన్నారా లేదా అని సైతణిఖీ చేసిపోతూ ఉంటారు. ఆజమీందారుగారు కుక్కలను చూచుకొని పొందే ఆనందానికి మేర ఉండదు.

## 2

జమీందారుగారికి ఇన్ని కుక్కలున్నప్పటికీ, ఇదిగాక వారితోకూడా ఎప్పుడూ విడవకుండా ఉండే మరొక స్పెషల్ జాతికుక్కల జత ఒకటి ఉన్నది. ఈ జత వారు ఇంగ్లండులో ఏరి తెచ్చుకొన్న జత. ఈ జతను శ్రీవారు సర్వకాల సర్వావస్థలయందును విడిచిపెట్టకుండా, వారివద్దనే పెట్టుకొని పెంచుతూ ఉంటారు. శ్రీవారు భోజనం చేయునప్పుడు ఈ రెండు కుక్కలూ వారికి చెరొక తట్టూ కూర్చొని భుజింపనిది శ్రీవారికి అన్నం నోటికి హితవుగా పోదు. వారు బల్లవద్ద కూర్చొని ఆఫీసుపని చేసుకొనేటప్పుడు ఈ కుక్కలు రెండూ వారికి ఇరుపార్శ్వములా కుషన్ కుర్చీలలో కూర్చునిఉంటవి. శ్రీవారు మోటారులో బయటికి వాహ్యాళి వెళ్లినప్పుడు కూడా ఈ రెండు కుక్కలూ వారితో మోటారెక్కిపోతూ ఉండవలసిందే. రాజాగారు రాత్రిళ్లు పండుకొనే గదిలోనే ఈ శునక దంపతులకుకూడా పడక.

ఈ రెండు సీమకుక్కలలోనూ మొగకుక్క పేరు జాకీ; ఆడకుక్కపేరు జానీ. ఇవికూడా జమీందారుగారివద్ద అమితంగా మాలిమయి వారిని ఎడబాసి ఒక్క నిమిషంకూడా ఉండేవికావు. అదిగాక అవి మాటలు నేర్చిన కుక్కలు. రా అంటే రావలసిందీ, పో అంటే పోవలసిందీ, కూర్చో అంటే కూర్చోవలసిందీని. జమీందారుగారికి అఖరుకు ఈ కుక్కలే వారసత్వం

వహిస్తా యని కొందరూ, తమకు పుత్రసంతానం కలిగినప్పటికీ, వారికి చెందకుండా ఉండేటట్లు తమ అనంతరం జాకీ సింహాసనానికి రావలసినట్లుగా ప్రతి సంవత్సరం జనవరి నెల ఒకటో తేదీన ఎస్టేటు అంతా జాకీకి వీలునామా వ్రాసి రిజిస్టరు చేయించి ఉంచుతున్నారని కొందరూ, వారసత్వం సంగతి నిజమైనా కాకపోయినా, ఈ రెండుకుక్కల పోషణ నిమిత్తమై శ్రీవారు ఒక లక్షరూపాయలు జాకీపేర బాంకిలో వేసి, వాటిపేర సెటిల్మెంటు వ్రాసియిచ్చారని కొందరూ — ఈ విధంగా అనేకరకాల పుకార్లు ఎస్టేటులో రోజుకు లక్ష బయల్దేరుతూ ఉంటాయి.

ఇటీవల ఒకనాడు జమీందారుగారు జాకీని, జానీని మోటారులో కూర్చోపెట్టుకొని, టౌన్‌హాలులో గాన సభకు బయల్దేరి వెళ్లి, బయట గేటువద్ద కారు నిలిపి, ఎవరో పెద్దమనిషితో మాట్లాడుతూ ఉండగా, ఒక యానాదిపిల్లవాడు, పదేళ్లవాడు, నల్లగా వంటి మీద గోచీతప్ప మరోగుడ్డ లేకుండా అసహ్యం వేస్తూ తళతళలాడే మోటారు సమీపించి, వింతగా చూస్తూ నిలబడ్డాడు. ఇంతలో ఎప్పుడు చూచిందో, జాకీ వాణ్ణి చూచి "నీ బ్రతుక్కు నువ్వుకూడా జమీందారు గారి మోటారును సమీపించి మమ్మల్ని అపవిత్రం చేస్తావా" అన్నట్లు ఆగ్రహించి, పరధ్యానంగా ఉన్న యానాదిపిల్లవాడిమీదికి గభాలున పెద్దపులి దూకినట్లు దూకి తొడలో ఒకకాటు వేసేసరకు, వాడు కెవ్వుమని కేక వేసి వెనక్కి విరుచుకొని పడ్డాడు. పరధ్యానంలో ఉన్న జమీందారుగారు ఇది గమనించి, "ఆ! ఆ! జాకీ, ఇట్లా రా" అని పిలవగా, అది తిరిగి మోటారులో ఎక్కి, తోక ఆడిస్తూ జమీందారుగారి చేతిని నాలుకతో చప్పరించింది. ఇంతలో గాన సభకు వేళ అయినందున మోటారు కదిలించి శ్రీవారు లోపలకు వెళ్లిపోయారు. బయట రోడ్డుమీద పడిపోయిన యానాదిపిల్లవాడు హఠాత్తుగా కలిగిన విపత్తుకు గుండె చెదరి, శరీరం ముచ్చెమటలు పోసి, రోడ్డుమీదనే వెల్లకిలా పడిపోయి ఉన్నాడు. మెత్తని లేతశరీరం అయినందువల్ల వాడిగల కుక్కకోరలు వాని తొడలో కసుక్కున వెన్నపూసలో కత్తి దిగినట్లు అంగుళంలోతు దిగి, గాయం అయి నెత్తురు ప్రవహిస్తున్నది. ఇంతలో వాళ్లవాళ్లెవరో వచ్చి, పిల్లవాణ్ణి లేవనెత్తి ఇంటికి తీసుకొనిపోయారు. కాని కుక్క కరిచిన పదిహేను రోజులకు వానికి సరిఅయిన చికిత్స లేక, రక్తంలోకి విషం ఎక్కి కుక్క అరుపు అరచి ఆపిల్లవాడు ప్రాణాలు వదిలివేశాడు.

ఆదినం యానాదిపిల్లవాణ్ణి కరిచివదిలగాయతు ఏందువల్లనో జాకీలో ఒక విధమైన కొత్త మార్పు కలుగుతూవచ్చింది. కాలక్రమేణా పది పదిహేను రోజులు జరిగేవరకు జాకీ పూర్వంవలెగాక పిచ్చిపిచ్చిగా అరవడం, ఇతర మనుష్యులమీదికే గాక అప్పుడప్పుడు జమీందారుగారి మీదికే దూకబోవడం, అనవసరంగా కోరలు బయటపెట్టి జానీనికూడా కరవబోవడం—ఏమిటో వెర్రివెర్రి చేష్టలు ఆరంభించింది. యానాదివాణ్ణి కరవడానికి పూర్వమే దానికి పిచ్చి ఎక్కిందో, లేక యానాదివాణ్ణి కరిచేవరకు వాని శరీరంలోని అపవిత్రమైన రక్తం ఉత్తమజాతి జాకీరక్తనాళాల్లో ప్రవేశించి అప్పటినుండీ దాని తత్త్వం చెడి ఏ జబ్బు అయినా ఆరంభం అయిందో—ఏకారణంవల్లనో గాని జాకీకి ఆరోజుకారోజు వెర్రివాలకం పడుతూ వచ్చింది. యానాదివాణ్ణి కాటువేసినప్పుడు జమీందారుగారు కళ్లారా చూచినప్పటికీ తర్వాత యానాదివాడేమయినాడో అన్న విచారణ చేయకపోవడం సహజమే అయినప్పటికీ, అది లగాయతు తమ జాకీలో ఎటువంటి మార్పు కలుగుతోందో అన్న ఆలోచనే వారికి తట్టకుండా వుండడమే ఆశ్చర్యకరమైన విషయం. ఆశ్చర్యానికి మాత్రం ఏముంది? 'బుద్ధిః కర్మానుసారిణీ' అన్నట్లు, దాని వేళ వచ్చేవరకు అన్నీ అట్లా ఒనగూడివస్తాయి. ఎట్లాగయితేనేం, పదిహేను రోజు లయినతర్వాత జాకీపైఖరి చూచేవరకు జమీందారుగారికి అనుమానమూ, భయమూ వేసి, అట్టే ఆలోచించుకోగా, ఆనాడు యానాది వాణ్ణి కరిచిన విషయం తటాలున జ్ఞప్తికివచ్చి, తక్షణం నౌకరును పంపి విచారించగా, అప్పటికి నాలుగురోజుల క్రిందటనే యానాదివాడు పిచ్చెత్తి చచ్చిపోయాడని తెలిసింది. దానితో జమీందారుగారికి గుండెలు

జల్లుమని, వెంటనే డాక్టరును పిలిపించేవరకు, ఆయన పరీక్షచేసి, ఏవో ఒకటిరెండు ఇంజక్షనులు ఇచ్చారు. కాని లాభం లేకపోయింది. పోనీ ఏ చెన్నపట్నానికో, కలకత్తాకో తీసుకొనివెళ్లి ఇంకా ఘట్టివైద్యం చేయించా లని శ్రీవారు ఆలోచన చేస్తుండగా ఆరోజు తెల్లవారేవరకే జాకీకి పిచ్చిఅరుపులు జాస్తిఅయి, ఉదయం ఏడుగంట లయ్యేసరికి ప్రాణాలు విడిచింది.

## ౩

జమీందారుగారికి మిన్నువిరిగి మీదపడినట్లయింది. ఇంత వైపరీత్యం జరుగుతుందని వారు కలలోకూడా అనుకోలేదు. వారికి తీరని దుఃఖం సంప్రాప్తమయింది. జాకీమరణానికి వారు కుప్పకూలి దుఃఖసాగరంలో మునిగిపోయారు. శ్రీవారి జనానా అంతా దుఃఖించారు. బంధువులందరూ దుఃఖించారు. ఇక వారి డబ్బు తినే తాబేదార్లూ, నౌకర్లూ చెప్పనే అవసరం లేదు. జమీందారుగారికి ఏకైకపుత్రునివంటి జాకీ చనిపోయిన దన్న వార్త ఒక్కగంటలో పట్నం అంతా వ్యాపించిపోయింది. పట్నం యావన్మందీ కడసారి చూపు చూడడానికి జనం గుంపులుగుంపులుగా దివాణంవాకిట మూగి కంట నీరు పెట్టుకొంటున్నారు. దివాణంవద్ద కలిగిన ఈ రోదనశబ్దం విని మహడీలలో ఉండిన రెండువందల కుక్కలూ జాకీమరణానికి దుఃఖించి, ఒక్కసారిగా గొంతెత్తి మొర్రో అని మొరగడం ఆరంభించినవి. ఆదినం దివాణంకచ్చేరీలకూ, ఉద్యోగులకూ శెలవు ప్రకటించారు. ఎస్టేటుదివాన్‌జీ గారు స్వయంగా వచ్చి, పడకకుర్చీలో ముఖంమీద చేతిరుమాలు కప్పుకొని పండుకొన్న జమీందారుగారిని పరామర్శిస్తూ శ్రీవారి దుఃఖాన్ని ఇనుమడింపజేశారు. సృష్టి అంతా ఆదినం మహాదుఃఖసాగరంలో మునిగిపోయినట్టుగా ఉన్నది రాజాగారికి. జాకీకళేబరం పెద్దపులివలె దివాణంవాకిట పడిఉన్నది. దాని జన్మలో అది ఎన్నడూ ఆవిధంగా వట్టినేలను, పరుపు అయినా లేకుండా పండుకొని ఎరగదు. దాని శరీరం ఎంత నొచ్చుకొంటున్నదో అని జమీందారుగారికి కడుపు తరుక్కొనిపోతున్నది. ఎంతమంది ఆప్తులు వచ్చి ఎంత ఊరడించి ఏం ప్రయోజనం! వంశాంకురం వంటి జాకీని మళ్లీ బ్రదికించగలవా రేరి ?

ఎంత దుఃఖించి ఏం క్రియ? 'జాతస్య మరణం ధ్రువం' అని, ప్రతిప్రాణికీ మరణం తప్పదుగదా అని వారూ వీరూ ఓదార్చగా, ఇక జరగవలసిన తంతు చాలా ఉండినందున శ్రీవారు ధైర్యం తెచ్చుకొని జరగవలసిన కర్మకాండ యథావిధిగా జరిపించాలని, దివాణపు పెద్ద పురోహితునితోనూ, తదితర ఆస్థాన పండితులతోనూ ఆలోచించి జాకీకి తగిన అంత్యక్రియా కాండ నిర్ణయించి దానిని బాండుమేళం ఊరేగింపుతో తీసుకొనిపోయి దహనసంస్కారం చేయించారు.

## ౪

జాకీ గతించినతర్వాత ఒక సంవత్సరంగా దాని జ్ఞాపకార్థమై ఏదైనా ఒక శాశ్వతమైన స్మారక చిహ్నం ఏర్పాటుచేయవలెనని జమీందారుగారికి మనస్సులో ఒక గాఢమైన కోరిక పుట్టింది. నాలుగు వీధులూ కలిసేచోట జాకీశిలావిగ్రహాన్ని ప్రతిష్ఠచేస్తామా, లేక లోహవిగ్రహం ప్రతిష్ఠ చేస్తామా, లేక జయస్తంభంలాంటి దొక రాతిస్తంభం కట్టిస్తామా అని పరిపరివిధాల ఆలోచన పోయింది. కాని వారు ఏదీ నిర్ధారణ చేసుకోలేకపోయారు.

ఇటీవల, జాకీ లైఫ్‌సైజు ఫోటోను ఆయిల్ పెయింటింగు ఒకటి తయారుచేయించి తెప్పించి వుంచారు. జాకీ సాంవత్సరికంనాటికి సరిగా ఒక ఏడాది పూర్తి అవుతుంది కాఁబట్టి, ఆనాడు జాకీ ప్రథమ వర్ధంతి ఉత్సవం జరిపి, ఈ ఫోటోను ఆంధ్రదేశంలో గల మరో జమీందారుగారిచేత తమ సభామండపంలో బహిరంగం చేయించాలని శ్రీవారొక ఏర్పాటు ఇదివరకే చేసుకొని ఉన్నారు. కాని వారి కంతటితో తృప్తికలుగలేదు. జాకీ ఆచంద్రార్కస్థాయిగా ప్రజలకు జ్ఞాపకం ఉండేటట్టు శాశ్వతమైన చిహ్నం ఒకటి నిర్మించాలని వారికి పెద్ద కోరిక కలిగి, ఆ విషయమై ఆలోచన తెగక, దివాన్‌జీగారితో సంప్రదించి వారి సలహా తీసుకోవడం మంచిదని రాజాగారు దివాన్‌జీగారిని పిలిపించారు.

దివాన్‌జీగారు యోధానయోధుడు. ఆయన కూడా ఆర్వేలశాఖీయుడే. సర్కారులో ముప్ఫయి ఏండ్లు తహశీల్దారుగిరీ వగైరా నౌకరీలు చేసి, లక్ష రూపాయలు సంపాదించి, ఏభయి అయిదో ఏట నెలకు నూటఏభయి రూపాయల పెన్షనుమీద రిటైరయిన చెయ్యి. వయస్సు ఏభయిఅయిదు దాటినా, తన కింకా శరీర దారుఢ్యం కలదనీ, అరవయ్యో సంవత్సరం వరకూ పని చెయ్యగలననీ, అందువల్ల తనను ఆ అయిదేళ్లూకూడా సర్వీసులో ఉంచవలసినదనీ ఆయనగారు జిల్లా కలెక్టరుకూ, గవర్నమెంటుకూ అర్జీలుపంపుకొని ప్రార్థించారు. కాని, ఆసమయానికి ఐరోపా సంగ్రామంలో యుద్ధం చేసి, దెబ్బలు తినివచ్చిన ఒక యూరోపియను హావిల్దారు ఆజిల్లాకు కలెక్టరుగా వచ్చినందువల్ల అతగాడికి ముసలి తాబేదార్లమీద కోత కలిగి, తహశీల్దారుగారి కోరికను నిరాకరించి, ఏభయిఅయిదో ఏడు దాటంగనే సర్వీసులోనుండి రిటైరు చేయించాడు. రిటైరయిన తర్వాత ఉద్యోగం లేకుండా ఇంటిదగ్గర గోళ్లు గిల్లుకుంటూ కూర్చోలేక ఆయనగారు వారినీ వీరినీ ఆశ్రయించి రాజాగారికి సిఫార్సులు చేయించుకోగా, సాటి నియోగి కదా అని శ్రీవారు అభిమానించి, నెలకు నాలుగువందల రూపాయలమీద వారిని తన ఎస్టేటు దివానుగా ఏర్పాటు చేసుకొన్నారు.

ఈ దివాన్‌జీగారు పీఠం అలంకరించినది లగాయితు ఎస్టేటు ఎస్టేటు అంతా చక్రం తిప్పినట్లు తిప్పేస్తున్నాడు. రాజాగారిని నిమిషంలో జేబులో వేసుకొన్నాడు. శ్రీవారి తత్వం బాగా గ్రహించుకొని వారికి తోచినట్లు సరిగ్గా సరిపాద్యో తాళపుహంగును వెనుక వేస్తూ, శ్రీవారి ఆదరాభిమానాలకు పాత్రుడైనాడు.

జాకీ స్మారకచిహ్నం శాశ్వతంగా ఉండాలంటే ఏరూపంగా చేస్తే బాగుంటుందని జమీందారుగారు దివాన్‌జీగారిని సలహాఅడిగారు. దివాన్‌జీగారు ఆస్తే ఆలోచించి నాలుగు బజార్లు కలిసేచోట నూట ఏభై అడుగుల ఎత్తున ఒక రాతి స్తంభమూ, దాని కెదురుగ్గా ఒక రాతిమంటపంలో పంచలోహములతో తయారుచేసిన జాకీవిగ్రహమూ ప్రతిష్ఠింపజేస్తే బాగుంటుందని సలహా యిచ్చారు.

శ్రీవారికి ఆనందబాష్పాలు కన్నులవెంట బొట బొట రాలినవి.

“ఈ రెంటికీ ఏమాత్రం ఖర్చుఅవుతుందో అంచనావేయండి” అని మళ్లీ అడిగారు జమీందారుగారు.

అయిదు నిముషాలు దివాన్‌జీగారు పైకి చూపు నిగిడ్చి, ఏమేమిటో తనలో తాను గొణిగి చేతివేళ్లు లెక్క పెట్టుకొంటూ—

“బంగారు, వెండి, కంచు వగైరా లోహములు కలిపిన ప్రతిమ చాలా ఖరీదు అవుతుంది. అదిగాక ఇట్లాంటివాటిని తయారుచేయగల పనివాళ్లు మన దేశంలో లేరు. ఈ ప్రతిమను ఏ జర్మనీలోనో, అమెరికాలోనో తయారుచేయించవలసి ఉంటుంది. కాబట్టి లోహవిగ్రహానికీ, రాతిస్తంభానికీ, మంటపానికీ అన్నిటికీ చేరి రమారమి ఏభయివేలయినా కాగలదని నా ఉద్దేశ్యం”

అని ఎస్టిమేటు వేశారు.

రాజాగారు రవంత ఆలోచించి “సరే: అయితే అయింది : ఎస్టేటు ఖజానాలోనుండి ఏభయివేలూ తక్షణం శాంక్షన్ చేయండి” అని హుకుం చేశారు.

కాని దివాన్‌జీగారు దూరాలోచన గల ఘటం కాబట్టి, “ఈ ఏభయివేలూ అచ్చం ఎస్టేటు భరించడం కంటె, దీనిలో ఏ పాతికభాగమో ఎస్టేటుతరఫున చందావేయించి, మిగిలిన నలభైవేల రూపాయలూ ఎస్టేటుగ్రామాలలో రైతులవద్దా, వర్తకులవద్దా చందాలువేయించి వసూలుచేస్తే బాగుంటుందని నామనవి” అని ఒక సవరణ తీసుకొని వచ్చాడు.

జమీందారుగారికి బ్రహ్మానందంవల్ల శరీరం తన్మయత్వంలో పడిపోయింది.

“మీ ఆలోచన చాలా బాగున్నది. ఇందుకు నేనెంతో కృతజ్ఞుణ్ణి. కాని ఇంత ద్రవ్యం వసూలు చేయడానికి ఆలస్యం అవడమే గాకుండా ఈపనిలో చాలా సిబ్బందిబలంకూడా కావలసిఉంటుందేమో!”

“ఆసందేహాలు తమ కవసరంలేదు. మీరు గుండెమీద చేయివేసుకొని నిద్రపోండి. అది అంతా చక్క బెట్టుకొనే భారం నాది.”

"సంతోషం. ఇతరపనులన్నీ కట్టిపెట్టి మీరు ముందీకార్యం తలపెట్టండి."

"నేను స్వయంగానే ఎస్టేటుగ్రామాలన్నీ సంచారం చేసివస్తాను. ఇట్లాంటి పెద్ద వ్యవహారాల్లో క్రింది తాబేదార్లకు స్వాతంత్ర్యం ఇచ్చి మనం ఉపేక్ష వహిస్తే సంస్థానానికి చెడ్డపేరు రాగలదు."

"ఓహో! మీకు నాకీయెడల ఇంతటి అపారమైన ఆదరాభిమానా లున్నవని నా కింతవరకూ తెలియనే తెలియదండీ. మీఆఫీసుపనులన్నీ అసిస్టెంటు దివాన్‌పరంగా అప్పచెప్పి వెంటనే బయల్దేరండి."

"అట్లనే. కాని మీరుమాత్రం ఒక పని చేయవలసిఉన్నది. దివాన్‌జీ గ్రామాలలో పర్యటనం నిమిత్తం వస్తున్నాడనీ, వారు కోరినప్రకారం దివాణం వారికి ప్రజలు కొంత ద్రవ్యసహాయం చేయవలసినదనీ కోరుతూ మీరు ప్రజల కొక విజ్ఞప్తి వ్రాసి నాచేతి కివ్వండి. దాన్ని నేను అచ్చువేయించి ప్రజలలో పంచిపెట్టి, మీతరఫున తగిన కథ అంతా నడుపుతా."

"ఓ! అవశ్యం అట్లనే వ్రాసియిస్తాను. అయినా ఆవిజ్ఞప్తిమతలబుకూడా మీరే వ్రాసి నాకు పంపండి. సంతకం చేసియిస్తాను."

"చిత్తం" అంటూ దివాన్‌జీగారు లేచి రాజాగారి శలవు తీసుకొని ఇంటికి చక్కా వెళ్లారు.

*

దివాన్‌జీగారు ఎస్టేటు హెడ్‌క్వార్టర్సు విడిచిన తరువాత అక్కడకు పదిమైళ్ల దూరంలో ఉన్న సేలటూరు గ్రామంలో మొట్టమొదట మకాం వేశారు. వారి మకాంరోజుకు ముందురోజునే ఉత్తరఖండం దివాన్ పేష్కారుగారూ, తాణాదారు వగైరా సిబ్బంది యావన్మందీ హాజరై తయారుగా ఉన్నారు. ప్రజల కష్టసుఖము లన్నీ విచారించడానికీ, వారికష్టములను తొలగించడానికీ రాజాగారు కనికరించి దివాన్‌జీ గారిని స్వయంగా పర్యటననిమిత్తం గ్రామాలకు పంపుతున్నారనీ, రైతులు స్వేచ్ఛగానూ, నిర్భయంగానూ దివాన్‌జీగారి యెదుట వారివారికి గల కష్టసుఖములను చెప్పుకోవచ్చుననీ ముందుగా అన్ని గ్రామాలలోనూ దండోరాపూర్వకముగా ప్రకటించినందున ఆదివారం ఉదయం ఏడు గంటలయ్యేసరికే చుట్టుప్రక్కల గ్రామాధికార్లూ, రైతులూ, మాలవాళ్లూ, మాదిగవాళ్లూ యావన్మందీ సేలటూరు చేరి దివాన్‌జీ గారి ఆగమనానికై యెదురుతెన్నులు చూస్తున్నారు. తమ ఇబ్బందులు తెలుపుకోదలచిన రైతులు కొందరు తెల్లకాగితాలమీద అర్జీలు వ్రాయించుకొని వాటిని నడుంగా మడిచి, చేతుల్లో పెట్టుకొని వస్తున్నారు.

దివాన్‌జీగారు ఉదయం ఏడున్నర గంటలకు రాగానే పేష్కారుగారు వారిని ఊరగవిడిలోనే పుష్పమాలాలంకృతులుగా చేసి, భోగం మేళంతోనూ, సన్నాయి మేళంతోనూ ఉత్సవంతో గ్రామంలోనికి తీసుకొనిపోయి ఆనాడు సభకుగాను వేసిన పందిటిలో వేంచేపు చేయించారు. వెంటనే సభ సమావేశమై, వేదికపై వేసిన కుర్చీలలో దివాన్‌జీగారూ, వారి ప్రక్కన పేష్కారుగారూ, తాణాదారుగారూ వరుసగా కూర్చున్నారు. రైతులు రెండు మూడువందల మంది తలకు మల్లుపాగాలు కిరీటాలవలె చుట్టి, చేతిలో కర్రలు పట్టుకొని, ముతకగుడ్డలు మోకాలిపైకి యెగగట్టి, చేత తలాఒక అర్జీ పట్టుకొని, 'దణ్ణాలు, దణ్ణాలు' అని దివాన్‌జీగారికి నమస్కరిస్తూ పందిటిలో వేసిన ఈతాకుచాపలమీద చతికిలబడ్డారు. పిమ్మట దివాన్ పేష్కారుగారు లేచి, దివాన్‌జీగారు ఎస్టేటు అంతా పర్యటనంచేసి, ఎస్టేటుపరిపాలన యావత్తూ రామరాజ్యంగా చేయడానికి విజయంచేసినారనీ, ప్రజలు వారి యెదుట నిర్భయంగా వారివారి యిబ్బందులను మనవి చేసుకోవచ్చుననీ చెప్పి దివాన్‌జీగారి ఆగమనంలో గల ప్రధానమైన ఉద్దేశాన్ని బయటకు వెల్లడిచేశారు. చంద్రుణ్ణి చూచిన చకోరపక్షులవలె రైతుల ముఖాలు వికసించినవి. ఎస్టేటుపరిపాలనలో నూతనశకం ఆరంభం అయినదని వారికి కొండంత ఆశ కలిగింది. ఈ తరుణం పోగొట్టుకోకుండా వాండ్ల ఇక్కట్టులన్నీ దివాన్‌జీగారితో మొరపెట్టుకోవాలని తీర్మానం చేసుకొని తయారుగా ఉన్నారు.

పిమ్మట దివాన్‌జీగారు లేచి, శ్రీ శ్రీ శ్రీ రాజాబహద్దరువారు గొప్ప ఉదారహృదయు లనీ,

తన రాష్ట్రంలోని ప్రజలను వారు తమ కడుపున కన్న బిడ్డలవలెనే ప్రేమించే ప్రేమస్వరూపు లనీ, సంస్థానంరాబడిలో ఏ అర్ధపరకభాగమో వారు స్వంతవినియోగానికై ఖర్చుపెట్టి, మిగిలిన ద్రవ్యం యావత్తూ ప్రజాక్షేమంకొరకే వినియోగింప కంకణం కట్టుకొన్న త్యాగమూర్తు లనీ ఒక పావుగంటసేపు జమీందారుగారి గుణగణములను సభలో వర్ణించి, పిమ్మట రైతులు తమ కష్టసుఖములు తెలుపుకోవచ్చునని ఉత్తర్వు చేశారు. రైతులు చెప్పుకొనే విషయాలు ఒక్కొక్క గ్రామానికే సంబంధించినవి ఒకటీ, రెండూ, మూడూ అని 'అయిటం'వారీగా వ్రాసుకొనుటకై పేష్కారుగారు తెల్లకాగితాల బైండు పుస్తకం తీసుకొని, కళ్లకు సులోచనాలు తగిలించుకొని, చేత ఫౌంటన్‌పేనా తీసుకొని తయారుగా ఉన్నారు. వెంటనే కూర్చున్న రైతులలో సేలటూరు రైతులు లేచి నిలబడి దివాన్‌జీగారికి నమస్కరించి–

"అయ్యా! మా గ్రామ చెరువు మరమ్మతుచేసి ఇప్పటికి పదిహేను ఇరవై ఏళ్లయినది. చెరువువరవ కాలవా, చెరువుతొట్టూకూడా ఒండ్రుమట్టితో మేట వేసి పూడిపోయినవి. పైగా చెరువు తూర్పుఅలుగూ, పడమటిఅలుగూ, చెరువుకట్టాకూడా పదేళ్లనాడు కొట్టిన గాలివానకు గండిపడి తెగిపోయినవి. అది లగాయతు వర్షాలు కురిసి నీళ్లు ఎంత పొమ్మగా వచ్చినా చెరువులో చుక్క నిలవడంలేదు. చెరువు మరమ్మతు చేయించవలసినదని దివాణంవారికి పదేళ్లుగా మేము ఎన్ని అర్జీలు పంపుకొన్నప్పటికీ, వాటికింతవరకూ దాఖలా మకాబూకూడా కలగలేదు. నీటిసప్లయి సరిగా లేక ఈపదేళ్లనుండీ మేము ఆయకట్టులో వరిపైరు పెట్టుకోవడం ముగించుకొని రాగిపైరూ, సజ్జపైరూ పెట్టుకొన్నప్పటికీ, దివాణంవారు మావద్ద గొర్రుకు ముప్పయి నలభైరూపాయలచొప్పున నగరికి మాగాణిశిస్తే వసూలు చేస్తుండారు. కాబట్టి సికస్తు అయిన చెరువును వెంటనే దురస్తుగా రిపేరు చేస్తేనేగాని మేం బ్రతకలేం" అని దణ్ణాలు పెట్టుకొన్నారు.

దివాన్‌జీగారు — సరే! పేష్కారుగారూ! వ్రాసుకోండి: అయిటం 1- సేలటూరు గ్రామ చెరువు మరమ్మతు. వెంటనే మీ గ్రామ చెరువు రిపేరుచేయించే ఏర్పాటు చేయిస్తాం. తర్వాత ?

రైతులు— మా గ్రామానికి నగరికి చెల్లించవలసిన భూమిశిస్తు ఎకరానికి రు. ౧౩-౮-౦ చొప్పున రేటు వసూలు చేస్తుండారు. గింజలకు ధర లుండిన రోజుల్లోకూడా, సర్కారు గ్రామాల్లో ఇరుగారు పండించుకొనే భూములకుకూడా ఇంతతరం రేటు లేదు. దానిపై ధరలు పడిపోయి చిన్నడబ్బు కంటికి అగుపడకుండా ఉండే రోజుల్లో ఇంతింత శిస్తులు కట్టేవరకు మాకు గ్రుడ్లు మీదికి వస్తుంటై. మాకంటే సర్కారుగ్రామాల రైతులే మేలు!

దివాన్‌జీ —అదిగో! అక్కడే మీరు పొరబడుతున్నారు. సర్కారుగ్రామాల పరిపాలన మేలు మేలని మీరు భ్రమపడుతున్నారు కాని, డబ్బు విషయం వచ్చినప్పుడు, నిజంగా జమీన్‌గ్రామాల రైతుల కున్నంత సౌకర్యం వాళ్లకు లేనేలేదు. జమీందారు సర్వాధికారి. ఆయన కనికరిస్తే శిస్తు పూర్తిగా తోసివేసి, రైతులకు ఉచితంగానే భూము లివ్వవచ్చు. ఏదీ! ఇట్లాంటి అధికారం సర్కారులో ఎవరి కుంది? కాబట్టి మీ రా వెర్రివెర్రి భ్రమలు మరిచిపోండి.

పేష్కారుగారూ, వ్రాసుకోండి: అయిటం 2- రైతులకు శిస్తులు తగ్గించడం. తర్వాత ?

రైతులు — మా పశువులు మేతమేసే కంచె భూములుకూడా రాజాగారు ప్రతీఏడూ వేలం వేస్తున్నారు. డబ్బాశకొద్దీ కొందరు పెద్దపెద్ద రైతులే కంచెలను వేలంలో కొని, మా పశువులు మేత మేసినందుకు పసరం ఒక్కంటికి రెండేసీ మూడేసీ రూపాయల చొప్పున మాదగ్గర పుల్లరి వసూలు చేస్తున్నారు. పశువులు పూరువిడిస్తే రాజాగారి కంచెలో అడుగు పెట్టనిది వాటికి కడుపులోకి గరికపోచ పోయే పాగి లేకపోయె! మేమైనా వస్తు పండుకొని, ఎంతెంత పుల్లరి అయినా కట్టి నోరులేని జీవాలను బ్రతికించుకోవాలె గదా! తమరు ఈ విషయమై కనికరించాలె.

దివాన్‌జీ — మీరు చెప్పిన దంతా సత్యం. రైతుకు తన ప్రాణంకంటె అధికమైనది పశువు. ఈ పుల్లరిపద్ధతి బొత్తిగా బాగులేదు. అవశ్యం రద్దు

చేస్తాం. వ్రాయండి: అయిటం 3-పశువుల కుల్లరి. తర్వాత?

రైతులు — ఇదివరలో మా రాజాగారి గ్రామాలకు కూడా ప్రతీఏటా కాకపోయినా, ఏ రెండు మూడు ఫసలీలకో ఒకసారి జమాబందీ జరుగుతూ ఉండేది. మేం దాఖలు చేసుకొన్న భూమిదరఖాస్తులూ, ఇస్తిఫాలూ, తీర్వ జాస్తీ అర్జీలూ ఫయిసల్ అవుతూ వుండేవి. అదేమిటోగాని, పెద్ద గాలివానకు ఇవతల నగరివారు జమాబందే జరుపలేదు. మేం ఎంత శిస్తు కట్టవలెనో లెఖ్ఖ తెలియక అల్లాడి అవులు మేస్తుండాం. పైగా ఈ కర్ణమూ, రెడ్డీ మునాసాట అరవై రోజులూ శిస్తువసూలని మా రక్తం పీల్చి పిప్పి చేస్తుండారు.

దివాన్‌జీ—నిజం! ఇంతకాలంగా జమాబందీ జరగకపోవడం చాలా అప్రతిష్ఠ. ఇకమీద సక్రమంగా జరిపేటట్లు చేయిస్తాం. వ్రాసుకోండి: అయిటం 4-జమాబందీలు. తర్వాత?

రైతులు— మేము మాలవాళ్లమండి. కుంఫినీ గ్రామాల్లో దొరతనంవారు బీదలకు బీడుభూములు పట్టాకు ఇస్తుండారు సామీ! నగరిభూములు చాలా బీడుభూము లుండై. గొప్పగొప్పరైతులే వాటినికూడా శివాయిక్రింద ఆక్రమించుకొని సాగుచేసుకొంటూ ఉండారు. ఏమూలనైనా చెత్తెడు నేలలో మేం నాగేలి మోటెస్తే, ఆసాములందరూ బడితెలు చేత బట్టుకొని మామైకి దూకుతారు మా కులవృత్తులన్నీ కూలిపోయి, కూలిగింజలయినా సంపాదించుకోలేక మలమల మాడి చస్తుండాం. మాకు తలారెండేసి ఎకరాల బీడుభూములు దిట్టానికి మంజూరుచేస్తే ఏ జొన్నకర్రలో వేసుకొని నీపేర దీపం పెట్టుకొని దణ్ణం పెట్టుకొంటాం—నా ఏలినవాడా!

దివాన్‌జీ—(మాలమాదిగలవద్దనుండి దరఖాస్తు లర్జీలు తీసుకొని) అట్లాగే. ఆలోచించి ఉత్తరువులు పంపుతాం. మీరు మాత్రం త్రాగుడు వగైరా దుర్వ్యసనాలు మాని, డబ్బు పాడుచేసుకోకుండా, నగరివారిచ్చే భూములు కష్టపడి సేద్యం చేసుకొని వృద్ధిలోనికి రావాలె. తెలిసిందా?

మాలమాదిగలు—బుద్ధి! బుద్ధి! నా ఏలినవాడా!

దివాన్‌జీ—వ్రాయండి పేష్కారుగారూ! అయిటం 5-బీదలకు భూములు.

ఒక క్రయిస్తవుడు—నేను ఈ గ్రామమాలవాడలో గ్రాంటుస్కూలు పెట్టి బడి చెప్పుతున్నాను సార్.

దివాన్‌జీ—ట్రయినింగు అయినావా?

క్రయిస్తవుడు—అయినాను సార్. హైయర్ గ్రేడు ప్యాసయినాను. క్రయిస్తవుణ్ణి. బడి పెట్టుకొనేటందుకు ఇల్లు లేక చాలా ఇబ్బందిగా ఉన్నది. నగరివారి అసలుమినహాలో ఎక్కడయినా నాలుగు తాటిచెట్లూ, ఒక వేపచెట్టూ, తాటిఆకూ మంజూరు చేయిస్తే ఒక చిన్న కొట్టం వేయించి బడి చెప్పుకొంటాను సార్!

దివాన్‌జీ—అర్జీ తెచ్చావా?

క్రైస్తవుడు-తెచ్చాను సార్. (అనియిచ్చును.)

దివాన్‌జీ—(తీసుకొని) ఉత్తర్వులు పంపుతాం. ఇల్లు వేయించి, చక్కగా బడిచెప్పి, బీదలను వృద్ధిలోనికి తీసుకొనిరా. ఈసారి మేము ఈగ్రామం వచ్చినప్పుడు నీ స్కూలు తణిఖీచేస్తాం. అయిటం 6—గ్రాంటు స్కూలుకు తాటిచెట్లూ, ఆకూను. వ్రాయండి. తర్వాత?

రైతులు—ఇప్పటి కివి చాలండి. తమరు చిత్తగించి ఈ ఇబ్బందులు గనక తొలిగిస్తే, ఇంకో తడవ మళ్లీ మనవిచేసికొంటాం. ఇంకా చెప్పుకోవలసిన ఇతర గ్రామాలవాండ్లు తొందరపడుతున్నారు.

అని సేలటూరురైతులు దణ్ణంపెట్టి పక్కకు తొలిగారు. పిదప ఇతరగ్రామాల రైతులు వరసగా ముందుకు వచ్చి, వారివారికి గల ఇబ్బందులన్నీ ఈ ప్రకారమే చెప్పుకోగా, దివాన్‌జీగారు వాటినికూడా పేష్కారుగారిచే పుస్తకంలో వ్రాయించారు. అప్పటికి తొమ్మిదిగంట లయింది. నిలబడిఉన్న రైతులనందరినీ కూర్చోవలసిన దని దివాన్‌జీగారు ఉత్తర్వులు చేయగా, అందరూ సర్దుకొని కూర్చున్నారు. పిమ్మట దివాన్‌జీగారు లేచి—

"మీరు విన్నవించుకొన్న విషయాలన్నీ మేము వ్రాసుకొన్నాం. మీరు దాఖలు చేసుకొన్న అర్జీలు తీసుకొని పోతున్నాం. ఈ విషయములన్నీ నేను స్వయంగా రాజాబహద్దరువారితో చర్చించి త్వరలోనే మీరు కోరిన సౌకర్యాలన్నీ ఏర్పాటు చేస్తాం. నిజంగా మీమీ ఇబ్బందులను నేను స్వయంగా తెలుసుకొన్నతర్వాత నామనస్సు చాలా పరితపిస్తున్నది. అవశ్యం మీకు తగిన ఏర్పాట్లు చేస్తాం.

"అయితే ఇప్పుడొక చిన్న విషయం మీకు నేను చెప్పవలసియున్నది. సావధానంగా వినండి. ఇటీవల శ్రీశ్రీశ్రీ రాజావారికి ఇంటివద్ద ఒక గొప్ప ఆపద సంభవించినది. అది లగాయతు వారు మిక్కిలీ చింతాక్రాంతులై ఉన్నారు. ఆవిషయమై వారు మీ కొక విజ్ఞప్తి పంపి, మీవల్ల కొంత ద్రవ్యసహాయం కోరియున్నారు."

అని దివాన్‌జీగారు రైతులకు తలాఒక విజ్ఞప్తి పత్రం పంచిపెట్టించారు. చదువువచ్చిన రైతులు కొందరు చదువుకొంటున్నారు. చదువురానివారు చేతిలో కాగితం పట్టుకొని చదువుకొన్నవారిని అడిగి తెలుసుకొంటున్నారు. ఇంతలో దివాన్‌జీగారు ఒక విజ్ఞప్తిపత్రాన్ని తీసుకొని ఈవిధంగా చదివి వినిపించారు:

"నా ఎస్టేటులో గల ప్రియజనులారా!

మేమిప్పుడు మీ కొక చిన్న విన్నపము చేయబోతున్నాము. ప్రపంచమునగల సమస్తమైన చతుష్పాద జంతువులలోనూ శునకము—అనగా కుక్క మిక్కిలి విశ్వాసము గల జంతువు. విశ్వాసముగల జంతువేగాక, నిజముగా పరిశీలించినచో, శునకము మానవునికంటె అనేకవిధముల ఉత్కృష్టమైన జంతువు అని చెప్పదగియున్నది. మాటాడ నేరదన్న లోప మొక్కటి తప్ప మిగిలిన విషయములలో శునకము మానవుని కెంత మాత్రమూ తీసిపోదు.

చిన్నతనమునుండీ మాకు భైరవమూర్తులయెడల ప్రత్యేక ఆదరాభిమానము లుండి, ఆజాతిని పోషించి కాపాడుటకు మేము పడుచున్న శ్రమ యంతయూ మీకు తెలియనిది కాదు. కాని ఇటీవల మా దివాణములో మా కొక గొప్ప దుర్దశ ప్రాప్తించినది. మాకు పరమ విశ్వాసపాత్రమైన ఒక జాతిసునకములదంపతులలో భర్త కుక్క అయిన జాకీ మాకు పరమవిశ్వాసపాత్రుడై, మా ప్రేమాతిశయముల కాటపట్టయి విరాజిల్లుతూ, ఇటీవల ఒక హీనజాతిమానవుని రక్తస్పర్శచే దానికి శరీరములో విషము ప్రవేశించి, జబ్బుచేసి అకస్మాత్తుగా ఆగ్రామసింహరాజము అకాలమృత్యువువాత బడి, మమ్ములను దుఃఖసాగరమున ముంచివేసినది.

తదాది మేము సదరు జాకీజ్ఞాపకార్థమై కొన్ని శాశ్వతమైన ధర్మకార్యములు చేయదలపెట్టితిమి. ఇందుకు ద్రవ్యసంపత్తి ఆత్యవసరమైనందున మేము జాకీస్మారకనిధి యను నొక ఫండును నిర్మించి, దానికి సంస్థానంతరఫున పదివేలరూపాయల విరాళము ఇచ్చియున్నాము. కావున నాకు పుత్రసములైన రైతుసోదరులున్ను, తదితరులున్ను భూతదయార్ద్రహృదయులరై వారివారికి తోచినరీతి జాకీస్మారక నిధికి భూరివిరాళము లర్పించి, జాకీ పేరును చిరస్థాయిగా భూమిపై నిలుచునట్లు చేసి, దాని ఆత్మకు శాంతి కలుగచేయుదు రని కోరుచున్నాడను.

ఇట్లు,
మీహితుడు
శ్రీశ్రీశ్రీ జమీందారు బహద్దరు"

దివాన్‌జీగారు చదవడం పూర్తిచేసినవెంటనే సభలో కరతాళధ్వనులు చెలరేగినవి. వారు చదివినదంతయూ వినికూడా, అర్థంగాని రైతులు కొందరు ఆపాటునే వెర్రిమొగాలు చూస్తూ కూర్చున్నారు. అర్థంఅయిన రైతులు తలమీది పాగాలు ప్రక్కకు తొలగించి తల గోక్కొంటున్నారు. కొంతసేపు సభలో నిశ్శబ్దం. వెనకగా, గడ్డాలకింద కర్రలు పోటించి నిలబడిఉన్న మాలమాదిగలు చల్లగా వెనక్కు తగ్గుతున్నారు. వెంటనే దివాన్ పేష్కారు గారు లేచి ఎవ్వరినీ సభ విడిచిపోవద్దని హెచ్చరిక చేస్తూ, విజ్ఞప్తిలోని విషయములే మరల విపులంగా తెలియజెప్పి, జాకీస్మారకనిధికి సహాయపడవలసిన దని ప్రబోధించారు.

పిమ్మట తాబేదారుగారు లేచి పెద్దపెద్ద రైతులను ఉద్దేశించి, "లేచిరావోయ్ మల్లారెడ్డీ! పెద్దవాడవు. ముందు నీవు దారి తీస్తేనేగాని వీల్లేదు." అని ఒక రైతును పేరుపెట్టి ఆహ్వానించారు.

"ఆ! ఏం పెద్దో స్వామీ! అన్నిటికంటే తాటి చెట్టు పెద్ద. లోపల జవసత్వాలుండవొద్దూ" అని ఆయన లేచి నిలబడి, జారిపోయిన మొలగుడ్డ బిగించుకొన్నాడు.

"నువ్వే అట్లా అంటే ఎట్లా చెప్పూ! ఎవ్వరూ లేకులే దనుకోరు. సంపన్న గృహస్థుడివి. ధర్మకార్యాల పట్ల కొంత ఔదారిగుణం కనపరచాలి. అందులో రాజాగారి స్వవిషయం ఇది. తెలుసునా" అని తాబేదారుగారు మళ్లీ ప్రబోధించారు.

ముఖాన్న చిరునవ్వు నవ్వుతూ, మల్లారెడ్డి అడుగులో అడుగు వేసుకొంటూ దివాన్జీగారి బల్ల దగ్గరకు పోయి, రెండునోటుబుక్కులో రు. ౩౦-౦-౦ లు అంకెవేసి సంతకం పెట్టాడు.

"అట్లా వీల్లేదు. నీదర్జాకు తగినట్టుగా పోకుంటే, నీకు లేకపోయినా, మాకందరికీ చిన్నతనంగా ఉన్నది. మొట్టమొదలు నీవే ఇట్లా చేస్తే ఎట్లా చెప్పూ" అని అంటూ తాబేదారుగారు బలవంతం చేసి, మల్లారెడ్డిచెయ్యి పట్టుకొని రు. ౩౦-౦-౦ లను రు. ౫౦-౦-౦ లుగా దిద్దించారు.

"అబ్బా! ఇట్లా నిక్కచ్చిచేస్తే ఎట్లా చెప్పండి పంతులూ" అని సణుగుకొంటూనే మల్లారెడ్డి అంకె సవరించి ఇవతలకు వచ్చాడు. పిదప సుబ్బారెడ్డీ, శేషురెడ్డీ, పోలారెడ్డీ, పట్టాభిరెడ్డీ, వెంకటనారాయణా, చినరామానారాయణా వగైరా ఇట్లాగే పేరులవరసన పేష్కారుగారు ఒక్కొక్కరినే పిలిచి, వాళ్లచేత తలా ముప్పయి, పాతికా, ఇరవై, పదిహేనూ, పదీ చందాలు వేయించగా, వాళ్లున్నూ పుస్తకంలో సంతకాలు పెట్టారు. పన్నెండు గంటలకు అచ్చం సెటూరుమీదనే జాకీ స్మారక నిధికి మూడువందల ఏభయి రూపాయల చందాలు పడినై. ఈ ప్రకారం మిగిలిన గ్రామాల రైతులచేత కూడా చందాలు వేయించి ఆ పైకం మరునాడు ఉదయం ఎనిమిది గంటలకు దివాన్జీగారివద్ద జమకట్టి రశీదు తీసుకొనిపోవలసిన దని రైతులకందరికీ గట్టిగా చెప్పినపిదప సభ చాలించి అందరూ భోజనాలకు వెళ్లి పోయారు.

౬

దివాన్జీగారి సమక్షంలో మొఖమాటంవల్ల తప్పించుకోలేక చందాలు వేసినప్పటికీ, తర్వాత బయటికి పోయి, వారిలో కొంతమందికి ఈ స్మారక నిధి ఏమిటో, ఈచందా లేమిటో, ఈ కుక్క లేమిటో అర్థం గాక తాబేదారు, దివాన్ పేష్కారువగైరా ఉద్యోగులను మరలమరల ఈ విషయమై విచారిస్తూ సందేహాలు తీర్చుకొంటున్నారు. వసూలయిన పైకం యావత్తూ బీదల సహాయార్థమై రాజాగారు ఆస్పత్రులనూ, ధర్మసత్రాలనూ, మంచినీళ్ల బావులు త్రవ్వించడానికీ వినియోగిస్తారని దివాణంసిబ్బంది రైతులకు నచ్చచెప్పి ధైర్యం చెప్పుతున్నారు. చందాలు పుస్తకంలో పడినదిలగాయతు పైకం చేతికి వచ్చేవరకూ దివాన్జీగారు ఆమకాంలోనే పీఠం వేసుకొని, తాబేదారీ సిబ్బందిని వసూలు డ్యూటీమీద పంపి నిలుచున్నట్టుగా డబ్బు వసూలుచేసి చేతిలో వేసుకొంటున్నారు. ఇచ్చుకో గల ఆసాములలో కొందరు ధర్మకార్యానికి సద్వినియోగం అవుతుంది గదా పైకం, కొంత ఈ విధంగా ఖర్చు అయితే కూడబెట్టుకొన్న సంచితం కొంత విడుదలై పోతుందన్న పారమార్థిక దృష్టితో తృప్తిపడి చెల్లిస్తున్నారు. డబ్బుమీద కాపీనం గల కొందరు నలుగురూ ఇచ్చి తా మివ్వకుంటే, ఈ ఎస్టేటువారు తెల్లవారి నిద్రలేస్తే నెత్తిమీది కేం తెచ్చి పెట్టుతారో అన్న భయంచేత, విధిలేక ముడుపులు మూటకట్టుతున్నారు. సమయానికి చేతిలో పైకం సర్దుబాటు లేని కొందరు సాహుకార్లదగ్గరా, పెద్ద రైతులదగ్గరా చేబదులు తీసుకొని పైకం సంతనచేసుకొంటున్నారు. చేబదులు చిక్కని ఆసాములలో కొంతమందికి తాబేదారు, సముద్దారు వగైరాలు తామే రహస్యంగా అవాల్తాపడి సమయానికి పైకం సర్దుబాటు చేసి వసూలయిన దని అనిపిస్తున్నారు. ఎట్లా అయి

తేశేం, మూడోరోజు సాయంత్రానికి ఆమకాంలో చందాలుపడ్డ పన్నెండువందల రూపాయలూ దివాన్‌జీగారు నిమ్మపాలమీద వసూలుచేసుకొని నాలుగోనాడు మరొక మజిలీకి చేరుకొన్నారు.

ఈప్రకారం రెండుమూడు ముసాఫర్లు జరిగే వరకు దివాన్‌జీగారు రైతుల బాధలను నివారించడానికీ, జాకీస్మారకనిధికి చందాలువేయించడానికీ బయల్దేరి వస్తున్నా రని ఎస్టేటంతా తెలిసిపోయింది. ఒక గ్రామంలో చందాలువేసి మరొకగ్రామంలో వేయకుంటే బాగుండ దనీ, దివాణంవారి సిబ్బంది ఎట్లాగా నెత్తిన రుద్దకుండా పోరనీ, తర్వాతి మకాంలో రాబోయ్యే గ్రామాల రైతులు ఈసంగతి విని, ఆయా గ్రామాధికార్ల ఒత్తిడిమీద ముందుగానే తయారుపడుతూ ఉన్నారు. రాజాగారి తర్వాత రాజాగారంత అధికారి దివాన్‌జీగారే స్వయంగా వస్తున్నారుగదా, వారి కింత సహాయం చేసినట్టూ ఉంటుంది, తమ కష్టసుఖాలు వారితో మనవి చేసుకొన్నట్టూ ఉంటుందని కొన్నిగ్రామాల రైతులు పరిపెట్టుకొని, ముడుపులు మూటకట్టుతున్నారు. గ్రామకట్టడి బాగా ఉన్న గ్రామాలలో ఒక్కొక్క రైతే ప్రత్యేకప్రత్యేకంగా చందాలు వేసే పద్ధతి మాని కాలవగట్ల పచ్చిగడ్డి వేలం పాటమీదా, చెరువుల్లోని చేపల వేలంపాటమీదా, పోరంబోకు భూములలోని నగరి ఫలవృక్షాల అమరాయి ఫలితం వేలంపాటమీదా, గ్రామఖర్చులకుగాను కూడబెట్టిన పైకంలో—ఆఏడు జరగవలసిన ఖర్చులలో, డి. పి. డబ్ల్యు. ఓవర్‌సీయరుకు, రెవిన్యూ ఇన్‌స్పెక్టరుకు, పోలీసువారికి వగైరాలకు ఇవ్వవలసిన మామూళ్లుపోను, మిగిలినవాటిలో ఏ అమ్మవారి జాతర ఖర్చులోనో, లేక వీధిభాగవతా లాడే దాసరి భాగవతులకూ, తోలుబొమ్మలాటవాళ్లకూ, పగటివేషగాండ్లకూ ఏటేటా ఇచ్చే మామూళ్లలోనో కొన్ని ఖర్చులు తగ్గించి, గ్రామ ఉమ్మడిసొమ్ములో రెండువందలో, మూడువందలో గ్రామంలోని నలుగురు పెద్ద తలకాయల సమ్మతిమీదా మొత్తంగా రొత్తిపెట్టి, దివాన్‌జీగారు గ్రామానికి రావటపరంలేకుండా ముందుగానే వారి దర్శనానికి పోయి డబ్బు చెల్లించి మరీ వస్తున్నారు. ఉమ్మడి సొమ్ముపద్ధతి లేని మరికొన్ని గ్రామాలలో నీళ్లపూటల దామాషా ప్రకారం గ్రామంలో పదిపూటలుంటే, పూటకు ఏ ఇరవయ్యో, ఏ ముప్ఫయ్యో చొప్పున ఇన్నూరో, మున్నూరో పూటదార్లే జమచేర్చి, దివాన్‌జీగారు వచ్చీరావడంతోనే స్మారకనిధికి మొత్తం కట్టివేసి, వారిని సాగనంపినతర్వాత వారివారి పూటల్లో గల చిల్లర రైతులదగ్గర ఎకరానికి పావలావంతునో, మూడణాలవంతునో పట్టీ వేసుకొని, తమకు రావలసిన పైకాన్ని నిదానంమీద దండుకొంటున్నారు. మరీ ఎత్తుబడిపోయి నాదారుస్థితిలో వున్న కొన్ని గ్రామాల రైతులు భయపడి, ఆగ్రామకర్ణాన్నీ, మునసబునీ ఆశ్రయించుకొని తాణాదారుగారికీ, దివాన్ పేష్కారుగారికీ సిఫారసులు చేయించుకొని, దివాన్‌జీగారి దృక్పథంలో వారి గ్రామం పడకుండా తప్పిపోయే ఏర్పాటులు చేసుకొంటున్నారు.

ఏవిధంచేతనయితేనేం, దివాన్‌జీగారు సంకల్పసిద్ధులు. కార్యం తలపెట్టిన వేళావిశేషం గొప్పదయినందున, స్మారకనిధికి విఘ్నేశ్వరపూజచేసి పట్టీ ఆరంభించింది లగాయతు ఏ ఆటంకములూ లేకుండా తలచుకొన్న పని క్షణంలో పూర్తి అవుతూ, కార్యం జయప్రదంగా జరుగుతూ వచ్చింది.

ఈప్రకారం రెండూ రెండున్నర నెలలపాటు దీక్షతో దివాన్‌జీగారు ఎస్టేటుగ్రామాలన్నీ పర్యటనం చేసి, చందాలు వసూలయినపిదప, హెడ్‌క్వార్టర్సుకు తిరిగివెళ్లారు. చందాపైకం రాజాగారూ, దివాన్‌జీగారూ లెఖ్ఖచూచుకోగా, ఇంకా వసూలు కావలసిన చిల్లరపద్దులు అక్కడక్కడ కొన్ని నిలిచిపోయినా, రాజాగా రిచ్చిన పదివేలూగాక, చందాలవల్ల వసూలయి చేతికి వచ్చిన రొఖ్ఖం ప్రత్యేకం ఏభయివేల రూపాయలవరకూ జాకీ స్మారకనిధికి చేరింది. ఈ వసూళ్లల్లో కొంత పైకాన్ని రాజాగారికి తెలియకుండా దివాన్‌జీగారు కరిణీకం చేశారని కొందరంటారు. ఎట్లయినప్పటికీ, దివాన్‌జీగారు మన రాజాగారికి కేవలం భగవత్స్వరూపులుగా గోచరిస్తున్నారు. వృద్ధాప్యంలో దివాన్‌జీగా రింత శ్రమ కోర్చి, జాకీ

రోడల ఇంత త్యాగబుద్ధి చూపినందుకు రాజాగారు సంతోషించి, వారికి అంతటినుండి సెలవు ఒకవంద రూపాయలు జీతం ప్రొమోషన్ చేశారు.

౭

పిమ్మట జాకీస్మారకనిధి ఏవిధంగా వినియోగం అయిందో ఎవ్వరికీ తెలియదుకాని, దివాన్జీగారు సంస్థానం హెడ్క్వార్టర్సుకు చేరిన వారంరోజులకు ఒకనాడు సేలటూరు గ్రామాధికార్లకు పోస్టులో ఒక కవరుమాత్రం వచ్చింది. దానిని విప్పి గ్రామకర్ణం, మునసబులు చదువుకోగా, ఆకాగితంలో ఈప్రకారం ఉన్నది:

"శ్రీశ్రీశ్రీ రాజాబహద్దరువారి
సంస్థానంనుండి
సేలటూరు గ్రామాధికార్లకు

మాదివాన్జీగారు మీగ్రామం విజయంచేసి నప్పుడు మీగ్రామరైతులు విన్నవించుకొన్న విన్నపము లన్నీ మేము స్వయముగా చిత్తగించినాం. చెరువుల మరమ్మతులు రైతులు ఉమ్మడిగా ఏల చేసుకోకూడదో తెలియకుండా ఉంది. ఈఆర్థికపుచిక్కుల రోజులలో రైతులు భూమిశిస్తు తగ్గించమని కోరడం, పుల్లరి కొట్టి వేయమని కోరడం ఉచితంగా కనిపించడం లేదు. అయినా, రైతులు కోరిన యావద్విషయాలనూ గట్టిగా ఆలోచించి త్వరలోనే ఉత్తర్వులను సాదరుచేయగల వారం. రైతు అభివృద్ధి, మా అభివృద్ధి రైతుక్షేమమే మాక్షేమమూ అని విశ్వసిస్తున్నాం.

సంతకం
ఫర్ జమీందారుగారు"

కాని అప్పటికీ ఇప్పటికీ జమీందారుగారివద్ద నుంచి ఉత్తర్వులు సాదరుకానేలేదు; జాకీవిగ్రహప్రతిష్ఠ యింకా జరగనూలేదు. అది తయారయిందన్న వారే కాని దాని నింతవరకూ చూచినవారూ లేరు.



# కాలగమన రంగంపై

## ఔరంగజేబు చక్రవర్తి సొంతవార్తాపత్రిక

అన్యజాతీయమైన ఆంగ్ల విద్యను అభ్యసించి, ఆంగ్ల మానసపుత్రులుగా పరివర్తన చెందిన భారతీయులలో ఒక మూఢవిశ్వాసం పాతుకుపోయివుంది.

అది ఏమంటే, నేడు మన నిత్యజీవితంలో అత్యంత ప్రయోజనకరాలుగా ఉంటున్న ప్రతిదీకూడా పాశ్చాత్యుల ప్రభావంవల్లనే మనకు సమకూరిందని.

ఉదాహరణకోసం ఎక్కడికో పోనక్కర్లేదు. తెల్లవారి లేస్తే చాలు, ప్రతివిషయాన్నీ ప్రజలకు బోధపరిచే పత్రికలనే తీసుకోవచ్చు.

ఆంగ్ల మానసపుత్రులైన ఈ మన మహానుభావులంటూండే దేమంటే — "చూడండీ! పాశ్చాత్యుల ప్రతిభ! ఎటువంటి వింతవింత, ప్రయోజనకరాలైన వాటిని సృష్టించారో! వాళ్లు మన దేశానికి రాకుంటే మనకీ ప్రయోజనా లన్నిటినీ పొందే యోగ్యత ఉండేదా?" అని.

కాని, ఇది నిజమా?

కాదు. ముమ్మాటికీ కాదు. మనకీ పాశ్చాత్య సంపర్కం కలగడానికి చాలాముందే పత్రికలనేవి వున్నాయి. అయితే, అప్పటి పరిస్థితులనుబట్టి వాటి ప్రయోజనం పరిమితంగా ఉండి ఉండొచ్చు. అయితే మటుకేం, పత్రిక లనేవి ఉండనే ఉన్నాయి.

ఈ విషయం చరిత్రలో కడిగిపోసిన సత్యం.

హిస్టారికల్ రికార్డ్సు కమీషన్‌వారి కలాపాల ౧౫-వ సంపుటం పరికించండి: ఔరంగజేబు చక్రవర్తి తన విశాల సామ్రాజ్యంలోని సంగతులను ఎప్పటికప్పుడు ఏవిధంగా తెలుసుకుంటూ వుండేవాడో బోధపడుతుంది.

ఔరంగజేబు చక్రవర్తికి సొంతంగా ఒక దిన పత్రిక వుండేదట. దానిలో, ప్రతిరోజూ దర్బారులో జరిగే విషయాలూ, విశేషాలూ, చక్రవర్తి కార్యకలాపాలూ, దర్బారు జరిగే సమయనిర్దేశం, ఉద్యోగుల నియామకాలూ, చక్రవర్తివల్ల బహుమతులను పొందిన వ్యక్తుల విషయాలూ, చక్రవర్తికి సమర్పింపబడిన కానుకల వివరాలూ, వివిధ ప్రాంతాలకు సంబంధించిన పరిపాలనావ్యవహారాల వార్తలూ ప్రకటితమౌతూండేవిట. ఈ పత్రిక బూడిదవర్ణపు కాగితముతో తయారవుతూండేవిట.

౧౯౨౩ లో జయపూరు ప్రభుత్వము తమవద్ద వున్న పురాతన పర్షియను రికార్డులను ఒక నిపుణుని చేత పరిష్కరింపిద్దామని నిశ్చయించుకొని, తత్కార్య నిర్వహణకు సర్ జదునాథసర్కారును ఆహ్వానించి, ఆ పని ఆయనకు వప్పగించినమీదట ఈ సత్యము బయటపడింది.

మాన్‌సింగ్, మిర్జా రాజా జయ్‌సింగు, సవాయ్ జయ్‌సింగుల లాంటి అతిరథ, మహారథులచే పాలితమైన రాజ్యములో చారిత్రక ప్రాధాన్యతకల రికార్డులు పర్షియన్, హిందీ భాషలలో పరశ్శతాలుగా ఉండడం సహజము.

ఎన్నో కాగితాల కట్టలు ధూళి ధూసరాలతో నిండివుండి, గుట్టలుగుట్టలుగా ఒక గదిలో ఉన్నాయి. పరిశోధకులు ఆ ధూళిధూసరాలను చల్లగా దులిపి చూస్తే, అవి పర్షియన్ భాషలో బూడిదవర్ణపు కాగితాలమీద వ్రాయబడిన 'అక్బరాత్-ఇ-దర్బార్-ఇ-

మాల్లా' లని తేలింది. అవి ఔరంగజేబుయొక్కా, ఆయన తర్వాతి వారియొక్క పరిపాలనకు సంబంధించినవి.

పరిశోధకునికి దొరికిన సెట్టులో రెండు సంపుటాలు ఉన్నాయి. ఇవన్నీ కూడా 'అక్బరాత్–ఇ–దర్బార్ – ఇ – మాల్లా' యొక్క సంచికలూ, అనుబంధాలే. ఒకప్పుడు జయపూరులోనే ఉండి, లండనులోని రాయల్ ఏషియాటిక్ సొసైటీ తరఫున సేకరింపబడి, లండనుకు కొనిపోబడిన కొన్ని పత్రాలకూ, వీటికీ ఆకారంలోనూ, రంగులోనూ, విషయాలలోనూ దగ్గరపోలికలు కనిపించాయి.

జయపూరులో కనుగొనబడినవాటిలో ఔరంగజేబు అనంతరం రాజ్యంచేసిన మరి ముగ్గురి కాలపు సంచికలు కూడా ఉన్నాయి. ఇవి ఔరంగజేబు పాలనాకాలంలో ౪౮-వ సంవత్సరంనుంచీ కనపడుతున్నాయి. ఆ మరుసటిసంవత్సరమే చక్రవర్తి సమరం స్వయంగా సాగించడానికిగాను దక్కనుకు వెళ్లాడు. అక్కడకూడా ఆయన తన సామ్రాజ్యంలో ఎక్కడ, ఎప్పుడు, ఏమి జరుగుతున్నదో వివరంగా ఎప్పటికప్పుడు తెలుసుకుంటూండేవాడు. అక్బరాత్‌లలో దక్కనును గురించిన సరైన సమాచారాలు, సరి కొత్తవి ఉన్నాయట. మూరాన, ఉత్తరాననున్న రాష్ట్రాల వార్తలుకూడా క్రమంగా, వివరంగా వస్తూవుండేవిట.

సత్యశర్మ.

---

## తేనీటి గుణములు

నేడు హిందూదేశములో తేయాకుపంట సమృద్ధిగా నున్నది. ఇది ఇంతగా అనుదినాభివృద్ధి పొందుతూవున్నదంటే కారణాలివే అనవచ్చు. తేయాకు—

దేహశ్రమను తీర్చి హాయి కలిగిస్తుంది.

మానసిక శ్రమను కూడా పోగొట్టుతుంది.

రాత్రిళ్లు పనిచేసే ఉద్యోగులకూ, శ్రామికులకూ గూడా 'అసహ్యసమయ' మనిపించే ఉదయకాల శ్రమను ఊడ్చిపారవేస్తుంది.

నరములకూ, మెదడుకూ మంచి ఉత్సాహాన్నిస్తుంది.

పరస్పర మైత్రిని సమకూరుస్తుంది.

నేటి యుద్ధకార్యాలలో ఇది సైనికులకూ, తదితర యుద్ధకార్య వ్యాపృతులకూ శాంతి సౌఖ్యాల నిస్తున్నది. అనేక వేళలలో ఆహారంగాకూడా పనికి వస్తున్నది.

నరములకు చెడుపు చేయని పానీయం ఇది.





# విమర్శనము

### శాస్త్ర దాస్యము

రచయిత : కొప్పరపు సుబ్బారావుగారు, నవజీవన్ గ్రంథమాల, తెనాలి. క్రౌను సైజులో ౧౦౮ పుటలు. వెల రు. ౧-౮-౦.

ప్రస్తుత కాలపు హిందూసంఘమును బాగు పరచవలెనను ఉద్దేశముతో వ్రాయబడిన గ్రంథములలో ఇది ఒకటి. సంఘసంస్కర్తలు వారివారి కార్యాచరణము నిమిత్తము అనేకమార్గములను త్రొక్కియున్నారు. బ్రహ్మసమాజమువారిది ఒకరీతి. ఆర్యసమాజమువారిది మరో ఫక్కీ. కందుకూరివారు ఒకమార్గము ఎన్నుకుంటే, త్రిపురనేనివారు మరోమార్గము అవలంబించారు. వానిలో ఈ గ్రంథము త్రిపురనేనివారిని అనుసరించి వ్రాయబడినది. అంతమందలి బ్రాహ్మణ ఉపాధ్యాయుని కథమాత్రము పరమానందాయ శిష్యుని కథలోనిదిగనో, లేక 'చదువుకొన్న మూఢులు' 'తత్త్వకేవల పండితః' అను వాక్యములను తార్కాణములుగ గైకొని యో వ్రాయబడిన కథలలాగు చదవడానికి చాలా సొంపుగావుంది. కాని ఈ గ్రంథమందే అనేకచోట్ల ఉదాహరించినలాగు అసలు భారతజాతిఅవనతికి మూలమైన 'ఖడ్గసంపన్నుడైన ఖండాంతరవాసి'ని సరియైనమార్గంలో పెట్టగలిగేయెడల తక్కినదంతా దానంతటదే బాగుపడుతుంది. ఇది అందరూ చదివిచూడవలసిన గ్రంథము.

---

### హంస

(ప్రగతి అంకము—భాగము 3)

సంపాదకుడు : అమృతరాయుగారు. సరస్వతీ ప్రెస్సు, బెనారస్ కాంటోన్మెంటు, బెనారసు. సంవత్సరంచందా రు ౬-౦-౦, విడిసంచిక ౦-౮-౦.

హిందీ భాషలో వెలువడుతున్న మాస పత్రిక ౧౩-వ సంపుటం, ౯-వ సంచిక మా కార్యస్థానము చేరినది. చిట్టచివరి రెండుకథలూ, సంపాదకీయ టిప్పణులూ తప్ప తక్కిన వ్యాసములన్నీ వివిధ దేశములలో వేరువేరు పరిస్థితులలో వర్తిల్లిన సాహిత్యములను గురించి వ్రాయబడినవి. అందు మొదటిది అమెరికా యందలి సామ్యవాదసాహిత్యమునకు చెందినది. రెండవ దానియందలి విషయము చీనా దేశములోని నవ్యసాహిత్యము. రష్యా దేశమందలి సోవియట్ కళాసాహిత్యమునకు సంబంధించినది మూడవ వ్యాసము. నాలుగవ దానిలో గత మహాయుద్ధానంతరము ఆంగ్లేయకవితలో కలిగిన వికాసమును గూర్చి వివరింపబడినది. రష్యాలోని వర్తమాన మహాయుద్ధసమయమున నెట్టి సాహిత్యము వెలువడుతున్నదీ మరోవ్యాసమున వర్ణితమైనది. అనంతరము స్పెయిను దేశములో ఫాసిస్టువిముఖులైన కొందరు ప్రఖ్యాత లేఖకుల జీవితసంగ్రహములు గలవు. ఇన్ని దేశములలోని భిన్నప్రకారములగు సాహిత్యకళావిషయముల నెరుగగోరువారల కిది ముఖ్య పఠనీయము.

---

### మన ఇండియా

గ్రంథకర్త : మినూ మసానిగారు. అనువాదకుడు: చింతా దీక్షితులుగారు. ప్రకాశకులు: ఆక్స్ఫర్డు యూనివర్సిటీ ప్రెస్సు, మదరాసు. వెల రూ.౧-౮-౦.

మన హిందూదేశమును గురించిన ఆర్థిక, పారిశ్రామిక, వైజ్ఞానిక విషయముల నన్నిటిని 'సూక్ష్మములో మోక్షము' అన్నట్లు ఇంత చిన్న గ్రంథములో సాకల్యముగా, అపూర్వమైన చక్కని శైలిలో విశదీకరించిన మసానీ నేర్పు నెంత చెప్పినను తీరదు. అయిదుగురిలో ఒక్కడు, సూర్యునిగానే తినగలవా, ఒక సమస్య, పే[illegible]క్కల మేడ, భూమియొక్క ఉప్పు, కొన్ని సందేహాలు - సమాధానాలు, చాలినంత భూమి లేదు, చెట్టుమీద పూలు, మన నిధులూ నిక్షేపాలూ, శక్తి, ఉక్కు మనుష్యులు, హిందూస్థాన్ హమారా— ఈ శీర్షికలను బట్టియే ఇందలి రచనాశైలిని, విషయవైశిష్ట్యమును ఊహించవచ్చును. చదువజదువ చవులు బుట్టించు నీశైలి నిజముగా అపూర్వమైనది. ఇందలి చిత్రములుగూడ గొప్పశిల్పముతో బహురమణీయముగా నున్నవి. చిన్నలు, పెద్దలుకూడ చదివి తెలిసికోవలసిన విషయములు ఇందులో శతాధికముగా నున్నవి. మూల రచనకు రవంతయినను తరుగు రానీయక అనువాదము బహుచక్కగా నున్నది. అనువాదమైనను అనువాద మనిపించుటలేదు. తెలుగుదనమును తియ్యగా తీర్చి దిద్దుకొన్నది. ఇటువంటి ఉత్తమరచనకు ఇటువంటి ఉత్తమానువాదమును చేయించి ప్రకటించిన ప్రకాశకుల కృషి మెచ్చుకోదగియున్నది. ఆంధ్రులందరును ఈ గ్రంథమును తప్పక చదివితీరవలెను.

---

## సాంధ్యగీతి

ఏకాంకరూపకము. రచయితలు : సూర్యచంద్రులు (జమ్మలమడక సూర్యప్రకాశరావు, జమ్మలమడక పూర్ణచంద్రరావుగార్లు). ప్రచురణకర్తలు సాధనసమితి, ౬౩ బి. బన్సీలాల్ పేట, సికిందరాబాదు. వెల నాలుగణాలు.

ఇందలి వస్తువు బుద్ధచరిత్రనుండి తీసికొన్నది. సాధనావస్థలో నున్నను ఈ యువరచయితల కృషి సర్వథా శుభోదర్కమును సూచించుచున్నది.

---

## వాహ్యాళి

రచయిత : బూర్గుల రంగనాథరావుగారు. సాధనసమితివారే దీనికిని ప్రకాశకులు. వెల ౬ అణాలు.

ఇందులోవి ఆరుకథలు. ఆంగ్లకథల ప్రోద్బలముతో కథలు వ్రాయుచున్న యువకథకులలో ఈరంగనాథరావుగా రొకరు. ఆంగ్లభాషా ప్రభావము, అధునాతన నాగరకతా సంప్రదాయములును వీరి కథలలో హెచ్చుగా నుండును. నేటి 'నాగరకజీవితములోని కొన్ని ఘట్టములను వీరు ప్రస్తుతకథలలో చిత్రించియున్నారు. కథావస్తువుల కనుగుణమై యున్నది రచనకూడ. ఉత్సాహపు పొంగులోనున్న ఈరచయితనుండి ముందుముందు మంచికథలను ఎదురుచూడవచ్చును. రచనలోను, భావములోను అనుకరణధోరణిని మాని దేశీయతను, జాతీయతను అలవరచుకొన్నచో ఈ కథావస్తువులకే వీరు మెరుగులు దిద్దలేకపోరని నమ్ముచున్నాము.

---

## బాలగోపాల శతకము

రచయిత: జయపురము మహారాజా శ్రీ విక్రమదేవవర్మగారు. బాలబాలికల యుపయోగార్థము పలు నీతులు ఈ తేటగీతుల శతకములో తేటగా బోధింపబడి యున్నవి. విషయము, రచన, భావముకూడ సమస్థాయిలో ఉన్నతముగా నుండి పండితపామరుల నందరిని సమానముగా మెప్పింపగలిగియున్నవి.

---

## దైవమాల

గ్రంథకర్త : విద్వాన్ చిట్టా రామకృష్ణరావుగారు, బి. ఏ. బి. ఇడి., యల్. యం. హైస్కూలు, గుత్తి.

వివిధచ్ఛందస్సులతో, వివిధ మకుటములతో ఈ తెనుగు పద్యముల స్తోత్రగ్రంథము రచింపబడినది. ముప్పాతిక శతకపు పరిమాణములో నున్నది. రచన సామాన్యమైనది. సహజత్వము తక్కువ.

---

## అద్దుక్కి మారయ్య

కన్నడ నాటకము. శివశరణ చరిత్రలోని ఒక కథను తీసికొని యిది రచింపబడినది. రచయిత : చన్న బసవరాజ దేశికేంద్రస్వామి. ప్రకాశకులు : యస్. యం. యజమాన్ అండ్ సన్, చిక్కపేట, బెంగుళూరు సిటీ. వెల ౫ అణాలు.

---

# గ్రంథస్వీకారము

---

## స్వభాను సం॥ర గంటల పంచాంగము

సిద్ధాంతి: గొట్టిముక్కల సుందరరామ శాస్త్రి గారు, నరసారావు పేట.

---

## ౧. వీరమతి
## ౨. సరస్వతి
## 3. ముద్రిక

ఈ మూడు నాటకగ్రంథములకును కర్త: శ్రీ. శ్రీ. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు. ప్రకాశకులు: కురుకూరి సుబ్బారావు అండు సన్, సరస్వతీ. బుక్ డిపో, బెజవాడ. తొలి రెంటివెల చెరి రు. ౧-౪-౦; మూడవదాని వెల ౧ రూ.

## తెలుగుతల్లి

గ్రంథకర్త: వేదాంతం వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారు. ప్రకాశకులు: కురుకూరి సుబ్బారావు అండ్ సన్, సరస్వతీ బుక్ డిపో, బెజవాడ. నూతన సాంఘిక నాటకము. వెల రూ. ౧-౪-౦.

---

## వేదాంతపంచదశి

విద్యారణ్యకృతి. కల్యాణపీయూష వ్యాఖ్యా సమేతము. వ్యాఖ్యాత: రాయప్రోలు లింగనసోమయాజిగారు, బి. ఏ., బి. యల్., వకీలు, గుంటూరు. వెల ౪ రూపాయలు. నాగరాక్షరముల ముద్రణము.

---

## ✓ శ్రీ శివభారతము

(శివాజీప్రబంధము)

గ్రంథకర్త: విద్వాన్ గడియారము వేంకట శేషశాస్త్రిగారు, శతావధాని, ప్రొద్దటూరు. డెమ్మీ సైజు. ౪౭౭ పుటలు, వెల రూ. 3-౭-0.

---



Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.

ఇండియా టీలలో అత్యుత్తమము




# లిప్టన్స్

జాకూజా * వైట్ లేబిల్

టీగరల్ రకములు

LTK-52-TG

లిప్టన్స్ టీని సేవించే ఆనందంలో అజాగ్రత్త సంభాషణలలో మునుగవద్దు.



నౌకాయానము - బెజవాడ కాలువ

:చిత్రకారుడు: శ్రీ వి. వి. రామారావు